# అవధూత లేఖలు

సేకరణ:

బులుసు సూర్యప్రకాశశాస్త్రి



ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి



వెల 3-00

★

# అవధూత సూక్తులు

రు. 1-00

"భగవన్నామ సంకీర్తనముచే తెలుగుజగతిని పులకిత మొనర్చిన శ్రీ సీతారఘువరదాసు - అను ప్రసిద్ధ నామము గలిగిన-పూజ్యశ్రీ అవధూతేంద్ర సరస్వతీస్వాముల వారి దివ్యోపదేశములుగల యీ పుస్తకం సమస్త మస్తకములందు ధారణ చేయ తగిన రత్నమై యున్నది".

— రామదర్శనం.

★

సాధన గ్రంథ మండలి, తెనాలి

# అవధూతలేఖలు

సేకరణ :

బులుసు సూర్యప్రకాశశాస్త్రి



ప్రకాశకులు :

సాధన గ్రంథ మండలి, తెనాలి.

 [వెల రు. 3-00

# అవధూతాష్టకమ్

శ్రీవిష్ణుచరణోద్భాసి, హృత్కుశేశయసుందరం।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

తృణీభూతం జగద్యస్య, మేరుభూతం హి కీర్తనం।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

నామైవ జీవనం యస్య, నామైవ పరమం ధనం।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

కోవిదం సర్వశాస్త్రేషు, కోవిదం విష్ణుకీర్తనే।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

తీర్థీభూతం మహాభూత్మానం, తీర్థసేవనతత్పరం।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

భాసయంతం హరేర్నామ సర్వవేదోపరిస్థితం।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

యస్య దర్శనమాత్రేణ, నాస్తికో హ్యాస్తికో భవేత్।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణమ్॥

సంకీర్తన మహాచార్య, మాంధ్ర్యాం భక్తిప్రవర్థకం।
వందే త్వా మవధూతేంద్ర, మాంధ్రగౌరాంగరూపిణం॥

అష్టకం హ్యవధూతస్య, యః పఠేత్ శృణుయాదపి।
అభక్తో భక్తి మాప్నోతి, భక్తో విష్ణోరనుగ్రహమ్॥

—బు. సూ. శాస్త్రి.

**శ్రీశ్రీశ్రీ ప.ప. అవధూతేంద్ర సరస్వతీస్వామివారు**

నామమహిమ నామనిష్ఠలను పూర్ణముగా తెలిసి, నామ సంకీర్తనలను తాముచేయుచూ అందరిచే చేయించుచూ ఈ కలిలో యావత్ ప్రపంచమునకే కాక విశ్వమునకంతటికిని అఖండబ్రహ్మానందామృతమును పరమశాంతిని ప్రసాదించిన సంకీర్తనావతారులు, అపర చైతన్యులు... శ్రీ అవధూతేంద్ర సరస్వతీస్వామిజీ

అయిననూ తామింతటి మహనీయులమను గంధ మాత్రము తమకు లేనట్లు తెలుపుటకా అన్నట్లు... ఉండ రాదని నేర్పుటకా అన్నట్లు..."నాకు పది జన్మలకైననూ భగవన్నామము సదాశివునకు,హనుమంతునకూ, శుకులవారికి, అర్థమైనట్లు అర్థమగునేమో" అని అనుచుండెడివారు. దీనిని బట్టి నామమహిమ, నామనిష్ఠలలోతు ఎంతవున్నదో మన బోటి మందబుద్ధులకు అందుట అసాధ్యము. మానవులకేగాక పశుపక్ష్యాదులకు మరియు చరాచరములకు సైతము తమ దివ్య సంకీర్తనామృతమును ద్రావించి యిట్టి అసంభవము గూడా నామానుగ్రహముచే సంభవమగునని యావత్ విశ్వ మునకు యెలుగెత్తిచాటి అఖండ అభయమునూ, అఖండ శాంతిని, ప్రసాదించిన ప్రాతః స్మరణీయులు శ్రీ అవధూతేంద్రసరస్వతీస్వామిజీ.

1973 లో గుంటూరులోని రామకోటి ఉత్సవము లలో టేపురికార్డుచేయబడిన శ్రీస్వామివారి దివ్యబోధామృత వాక్యములను యథాతథముగానేకరించి,భక్తజన మానససరో జోల్లాస దర్శనామృతపానమునకై సమర్పించుకొనుచున్నాను.

పసుమర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి.



భక్తివేరు జ్ఞానంవేరు కాదు. అసలు అద్వైతికి, వేదాంతికి ఒకటి నిషేధింపదగింది యేదైనా వుంది అంటే వాడు అద్వైతి యెట్లా అవుతాడు! వేదాంతి యెట్లా అవుతాడు!...కనుక భక్తి అనేటటువంటిది మూర్తీభవించి వుంటేనే నిజంగా వేదాంతం పండితులీ కలియుగంలో లేక పోయినట్టయితే అది వాడినే మోసగిస్తుందేమో! అంత ప్రమాదం వుంది యీభక్తిలేనటువంటి పరిస్థితిలో యెందుకంటే...

"ఏతస్మిన్ సమయే కలిః హి కిల ప్రబలకామాదిభి ర్దూషితః"

ఇదికలియుగం. ఈకలియుగంయొక్క ముచ్చటవచ్చినప్పుడు యెంత హెచ్చరిక చేసిచెప్పేరంటే మహాత్ములు...

ఇక్కడ కామప్రకోపం బాగావిజృంభించివుంటుంది. ప్రతి వాడికీ పేరుప్రతిష్ఠలు బాగా కావలసివస్తూ వుంటాయి... అట్టిపరిస్థితిలో వాడికి యేంపడుతుంది...

"వేదాంత శ్రవణాది సర్వపుకరో న్నిర్వీర్య మూర్తితలే"

నిర్వీర్యంగావుంటాయట వేదాంత సంబంధమైనటు వంటి శ్రవణాదులన్నికూడా. ఒక్కడబ్బుకోసం తహతహ లాడుతూవుంటారు. ఈ మహావాక్యములు వినేటటువంటి వారు... ఈ శ్రవణం చేసేటటువంటివాళ్ళు... అని చెప్పి మన పూర్వులు చెప్పేరు అంటే మనమీద వాళ్ళకు ద్వేషమా!.. అసూయా !... ఈర్ష్యా !... లేదు. వాళ్ళకి తెలుసును. యోగులకి అంతావర్తమానమే... భూతము, భవిష్యత్ అంటూలేదు యోగులకి వర్తమానమే...వాళ్ళకి తెలుసును...

"కలికేవల మలమూల మలీనా పాపపయోనిధిజల మనమీనా"

మనస్సులు అగాధమైనటువంటి నీటిలో చేపలు యెట్లా తన్మయంగా వుంటాయో, పాపరూప సముద్రంలో యీ కలిజీవుల చిత్తములుకూడా అట్లాగే తన్మయంగా వుంటూ వుంటాయి అని చెబుతూ... అట్టివారుకూడా భగవంతుని యొక్క అనుగ్రహాన్ని సంపాదించుకోటానికి మహదవకాశం వున్నది. యేమిటయ్యా అంటే...

"భగవత్ కథ....భగవన్నామం...."

భగవత్ కథ విషయంలో భాగవతంతీసుకోండి... భాగ వతాన్నిగూర్చి యేంచెప్పేరు... బ్రహ్మసూత్రములకు, ఉప

నిపత్తులకు, భగవద్గీతకు కూడా అర్థమని చెప్పేరు. అటువంటి భాగవతాన్ని గనక శ్రద్ధా, భక్తితో సేవించినట్లయితే వాడికి యేమి లోటువుంటుంది !...వాసుదేవ...

"కథాకీర్తన కలివిషే భవసాగర్ కీ నావ్"

చక్కగా భగవంతునికథ యెంత చక్కగా మీరు అనుసంధానంచేస్తే అంతమీకు భగవంతునియొక్క అనుగ్రహం కలుగుతుంది. అనుగ్రహం కలగటం యేమిటి...దీనియందుఅభిరుచికలగటంయేమిటి!...వాసుదేవ...వాసుదేవ..

ఆత్మ అర్థం అయినట్టే భగవన్నామం అర్థం అయితే...భగవన్నామం అర్థం అయితే ఆత్మవంతుడే!... ఆత్మవంతుడికి భగవన్నామం వేరుకాదు అనేటటువంటిది స్పష్టంగా శివుడికి అర్థమైనట్లు, ఆ హనుమంతుడికి అర్థమైనట్లు, శుకులవారికి అర్థమైనట్లు, త్యాగరాజులవారికి అర్థమైనట్లు అర్థం అవుతుంది...వాసుదేవ!—

యేమొస్తుంది భగవన్నామం చేస్తే?...అనుకుంటారు సామాన్యులు...వాళ్ళఖర్మఅది...వాళ్ళఖర్మ...వాళ్ళు చదువుకున్నవాళ్ళు అయినాసరే! భగవంతునిగురించి అంటే యెంతో భగవన్నామాన్నిగురించికూడా అంతే అనేటటువంటిమాట వాళ్ళకి తెలియకపోగా యేంచేస్తుంది రామనామం అంటే...అంటాడు...యేంచేస్తుంది?...కత్తిరిస్తుంది రామనామం. ఈ"ర"కార"మ"కారములు కత్తిరించి పారేస్తాయి సంసారవృక్షముయొక్క కూకటివ్రేళ్ళని ... అని చెప్పి... నేనుకాదు చెప్పటం!...శ్రీధరులవారే చెప్పేరు...

"సదా సర్వత్రాఽస్తే నను విమల మాద్యం తవ పదం
తథాఽపి ... .... .... ....
ఏకం స్తోకం నహి భవతరోఃపత్ర మభినతః"

"స్వామీ!భగవాన్!ప్రభో! ... ఉన్నదంతా నువ్వే నయ్యా!...అయితే ... సంసారవృక్షముయొక్క చిగురుటాకులుకూడ త్రుంచలేకపోతున్నావు. నువ్వు! ... అని చెబుతూ తర్వాత ఒకమాట అన్నారు...

"క్షణం జిహ్వాగ్రస్థం తవను భగవన్నామనిఖిలం.
సమూలం సంసారం కషతి కతరతు సేవ్యమానయోః"

ఒక్క-క్షణం కనక జిహ్వామీద భగవన్నామమును నృత్యంచేయించినట్లయితే కూకటివ్రేళ్ళతోటి పెకలించి కత్తిరించి అవతలపారేస్తుంది నీనామము! ... యేది సేవించమంటారు స్వామి! అని చెప్పి శ్రీధరులవారు భగవన్నామ విషయంలో ఈశ్లోకం చెప్పేరు...వాసుదేవా!...

అందుచేత...శ్రవణం చేసుకోండి,...అన్ని సాధనలు చేసుకోండి,...కానీ అన్నిటికికూడా ప్రాణం భగవన్నామం అనేటటువంటిమాట మర్చేపోవద్దు. ఈప్రాణంభగవన్నామం అనేటటువంటిమాట యెవనికి బాగాహత్తుకుంటుందంటే... నామము, నామి రెండు కాదనేటటువంటియొక్క విషయం తెలునుకొనేటటువంటి సాధకునకే!...వాసుదేవా!...భక్తవత్సలభగవాన్ కీ...జై...

అవధూతేంద్రసరస్వతీస్వామి

# పరిచయము

దాదాపు పన్నెండేళ్ళమాట. నేను గుడివాడనుంచి బెజవాడకు వస్తూ, బెజవాడ స్టేషనులో ఉదయం తొమ్మిది గంటలకు దిగాను. బండి దిగానోలేదో, రమణాశ్రయి శ్రీ వెంకటరత్నంగారు కనుపించారు. ఎక్కడకు వెడుతున్నారని అడుగగా అవధూతేంద్రులతో భీమవరానికి వెడుతున్నానన్నారు. "రండి చరిచయం చేస్తాను. మీరు ఇంతవరకు స్వాములవారిని చూడలేదు కదా!" అని అన్నారు. ఇద్దరమూ కలసి ఫస్టుక్లాసు కంపార్ట్‌మెంటుకు వెళ్ళాము. అదివరకే, ఆయనను వీడ్కొనటానికి వచ్చిన భక్తదంపతులూ పెట్టెలో వున్నారు. స్వాములవారు నిలుచుని వున్నారు. రమణాశ్రయి నన్ను పరిచయం చేయగానే, స్వాములవారు దగ్గరకు వచ్చి ఆలింగనం చేసుకొని 'ఎంతసుదినం!' అన్నారు! చాలమంది సన్న్యాసులను నేను చూచాను. కాని ఈలాంటి అనుభవం ఇదే ప్రథమం. వారి వినయోజ్జ్వలతకు నేను నివ్వెరపోయాను. నన్ను చూడటం వారికి సుదినమట! కరచరణాద్యంగసహిత దేహభావన పీడని నాకు వారి స్థాయి ఏలా అర్థమౌతుంది? వారు నన్ను చూడలేదనీ - నాలోని వాసుదేవుణ్ణి - వాసుదేవస్సర్వమితి-అన్న భావనలోచూస్తున్నారని నాబుద్ధికి ఏలా తట్టుతుంది! వారికి నమస్కారం చేసి సెలవు తీసుకొన్నాను. వారితో నా ప్రథమ సమావేశమది.

అప్పుడప్పుడు రమణాశ్రయి నాకు వీరిని గూర్చి చెప్పుతుండేవారు. రమణాశ్రయులకు అవధూతలంటే, అమితమైన

గౌరవం, ప్రేమ. వారి వస్త్రములను ప్రక్షాళనంచేసి ఎండ వేసేవారు. వారికి సపర్యాదికములు చేయటంలో ఆయనకు చాల శ్రద్ధ. ఆయన సప్తాహములలో వెంకటరత్నంగారు తరచు పాల్గొనేవారు. వెంకటరత్నంగారంటే, అవధూత లకూ చాలమర్యాద, గొప్ప అభిప్రాయం ఉండేది. ఈ విషయం వారి లేఖలలోకూడ వ్యక్తమౌతుంది.

సన్యాసికి నామానుసంధానమా? అని కొందరికి సందేహం వేయవచ్చును. అందులో వేదాంతులని చెప్పుకొనేవారు నామమును తక్కువ మెట్టుగా చూడటంకూడ కద్దు. అట్లా చూచేవాళ్ళని మనం నిజమైన వేదాంతులు అని చెప్పుకో లేము. నామానుసంధాన సౌఖ్యము అనుభవించినవాళ్ళు!

"నామకుసుమములచే
నాదస్వరమను నవరత్నపు వేదికపై
పరమాత్ముని శ్రీరాముని పాదములను పూజించి
నిత్యమైన సుస్వరపు గానముతో
నిరంతరము త్యాగరాజ నుత —
సుఖిఎవ్వరో - రామనామ
సుఖిఎవ్వరో"—

అన్న త్యాగరాజుతో ఏకీభవించి, స్తబ్ధత వహిస్తారు. వ్యాసాచార్యులవారు 'యాని నామాని గౌణాని'అన్నారు. అనంతుడైన భగవంతుని అనంతగుణములను తెలిపేది నామమే. 'నామా న్యనంతస్య యశోంకితాని' త్యాగయ్యగారే, సీనామామృత పానము యను సోపానము దొరికెను-అనియు, 'రామనాను శ్రవణమువల్ల నామరూపమే హృదయమునిండి

ప్రేమబుట్ట జేయగలేదా!' అనియు రామునితో సంభాషిస్తారు. ఆంధ్రదేశంలో నామామృతమును తాను సేవించుటయేకాక, పట్టణములలో, జనపదములలో, నలుగురికి పంచిపెట్టిన ఘనత ఒక్క అవధూతేంద్రసరస్వతులకే చెల్లింది. అంతటినామనిష్ఠగలవారిని ఇతరులను నేను చూడలేదు.

అవధూతలలేఖలలో మనకు లెక్కలేనన్ని బోధలే కాదు,రసగుళికలలాంటి సాధన ప్రక్రియలు కనబడుతుంటాయి. నివురుగప్పిన నిప్పులాంటి వారి విద్వత్తు అక్కడక్కడా తొంగిచూస్తు వుంటుంది. అవధూతలకు భాగవతమంటే మరి పరమాన్నమే. అందులో ఏకాదశస్కంధము అతీవ ప్రియము. అందులోనూ వుద్ధవునికి కృష్ణుడు చెప్పినమాటలు ప్రత్యేకంగా వారిస్వాధీనం. అస్వాధీనమైన తత్త్వం వారి దేహంలో అణువణువునా జీర్ణించిపోయింది. దానితో వారికి ఎక్కడచూచినా వాసుదేవాద్వైతమే కనబడేది; లోకం లోకంగా కనబడలేదు, చెట్లు, చేములూ, పిట్టలూ, పశువులూ, అన్నీ కృష్ణపరబ్రహ్మగానే వారు చూచేవారు. "అన్నిటికీ అన్నీ శ్రీశ్యామసుందరుడేకదా! ఈ అనుభవం రావాలా? రాలేదా? రాకుండావుందా? ఇది ప్రత్యక్షం కాదు. నిత్యాపరోక్షమే. నిత్యాపరోక్షమే-నిత్యాపరోక్షమే." (పేజి 61 చూడండి) అని ముమ్మాటికి సత్యమని అవధూతలు ఘోషిస్తారు. అవధూతలవారికి అపరోక్షానుభూతి లేకుంటే ఇలా ఘంటాపథంగా పలుకరు.

1972లో మాతల్లిగారు హృద్రోగంతో మంచమెక్కి ఆరునెలలు అవస్థ పడ్డారు. లఘుశంకలు, అల్పాచమానాలూ

పడకలోనే జరిగేవి. 1973, శివరాత్రికి అవధూతలు, రమణాశ్రయి బొంబాయివచ్చారు. అపుడు ఇరువురూ కలసి మా ఇంటికి వచ్చారు. అప్పటికి మాతల్లిగారికి కొంచెం తెరపిగా వున్నది. కానీ పూర్తిగా కోలుకోలేదు. అవధూతలు తాముగా ఆమెపడకవద్దకు వెళ్ళి ప్రేమతో పరామర్శ చేశారు. "అచ్యుతానంతగోవింద"-అనే నామత్రయాన్ని సదా స్మరిస్తూరండి. మీకు ఖండితంగా నెమ్మదొతుంది. వ్యాసాచార్యులవారు ఈవిషయాన్ని గట్టిగా చెప్పారుఅని;

అచ్యుతానన్త గోవింద నామోచ్చారణ భేషజాత్-
నశ్యన్తి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహం;
సత్యం సత్యం పునస్సత్య ముద్ధృత్య భుజముచ్యతే,
వేదాచ్ఛాస్త్రం పరం నాస్తి నదైవం కేశవాత్పరమ్.
శరీరే జర్ఝరీ భూతే వ్యాధిగ్రస్తే కళేబరే,
ఔషధం జాహ్నవీ తోయం వైద్యో నారాయణో హరిః—

అన్న శ్లోకాలు చదివారు. వారువెళ్ళిన నాలుగైదు నెలలకు మా అమ్మగారు పరిపూర్ణంగా ఆరోగ్యం కోలుకొన్నారు. అవధూతలవారి అచంచల విశ్వాసమే అమ్మగారికి ఆరోగ్యప్రదమైనదని అనుకొన్నాను.

ఈ అవధూత లేఖలలో వారి ఐకాంతిక భక్తి, అడుగడుగునా కనబడుతూ వుంటుంది. ఒకచోట వారంటారు. "సగుణోపాసనయే కేవలము నిర్గుణోపాసనకు చరమోపాయము. విశేషించి ఈ కలిలో నామము ముఖ్యోపాయము, సగుణపరిచయం పూర్తిగా కలుగకుండా ఈ దినములలో

వేదాంతులకు రాగద్వేషములు పోవడంలేదు. ద్వైతభ్రమ వారలకు అధికంగా గోచరించుచున్నది. సగుణపరిచయం పూర్తిగానిచో వేదాంతం విషంగా పరిణమిస్తుంది."

"సగుణజ్ఞాన హీనస్య నహి నిర్గుణవేదనం,
నందిదర్శన హీనస్య యథా న శివదర్శనం,"

(నందిదర్శనంలేని వానికి ఎట్లా శివదర్శనం లేదో, సగుణజ్ఞాన హీనుడికి నిర్గుణం అట్లా అర్థంకాదు.)

పరిపూర్ణసగుణోపాసకులకు సందేహం అసలేవుండదు. పరిపూర్ణ నిర్గుణోపాసకుల విషయం తెలిసేవున్నది. వారిది మహామానస్థితి. అటూకాక ఇటూకాక, ఏవిధమైన ఉపాసనాలేక వేదాంతనిష్ఠా చేతకాక వెఱ్ఱివేషాలువేసే డాంబికులకే ఈవివాదాలన్నీ, వారికొక నమస్కారంపెట్టి, అవసూత లేఖలను రోజుకు ఒక్కలేఖ చొప్పున సేవిస్తూవస్తే, మనలను ఆవరించిన తిమిరం తొలగి, మబ్బుచాటున మెరిసే మెరుపు తీగవలె, హైమవతి దర్శనం ఎన్నడో ఒకరోజు కలుగక పోదని నా విశ్వాసం. దానితో అన్నిగ్రంథులూ సడలి పోతాయి.

యామాహుః సర్వలోకానాం ప్రకృతిం శాస్త్రపారగాః,
తాం ధర్మచారిణీం శంభోః ప్రణమామి పరాంశివాం.

బొంబాయి

పింగళ–నరసింహజయంతి. "వి శా ఖ."

## ఈ గ్రంథ ముద్రణకు, ఈ క్రింది భక్తులు సాయము చేసినారు

| | |
|---|---|
| కీ. శే. పోలిశెట్టి సోమసుందరంగారి జ్ఞాపకార్థము, కుమారులు, గుంటూరు | 250-00 |
| శ్రీ హరికిషన్‌లద్దాగారు, డోర్నకల్లు | 116-00 |
| శ్రీ రూపాకుల సుందరమ్మగారు, తెనాలి | 100-00 |
| శ్రీ ఎ. యశోదమ్మగారు, నెల్లూరుపల్లె | 100-00 |
| శ్రీ తటవర్తి రాజశ్యామల, తెనాలి | 100-00 |
| శ్రీ మీనాక్షమ్మ, గురుస్వామి మొదలియారు భీమవరం | 50-00 |
| శ్రీ దండు లక్ష్మీనరసింహ రాజుగారు ధర్మపత్ని శ్రీమతి జానకమ్మగారు, సిద్ధాంతం | 50-00 |
| శ్రీ యం. సత్యనారాయణ రాజుగారు, చెరుకుమిల్లి | 50-00 |
| శ్రీ వులిచి ఆదిశేషదాసుగారు, గుంటూరు | రు. 30-00 |
| ఒక భక్తురాలు, తెనాలి | 30-00 |
| ఒక భక్తురాలు గుంటూరు | 25-00 |
| శ్రీ ఎ. వి. సుబ్బారావుగారు, చీరాల | 10-00 |

# మండలి మాట

"శంనో విష్ణురురుక్రమః"

హరేర్నామ హరేర్నామ, హరేర్నామైవ కేవలం।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥

నామావతారులు, అపరచైతన్యులు, ప్రాతః స్మరణీయులు, బ్రహ్మీభూతులు అగు శ్రీశ్రీశ్రీ ప. ప. అవధూతేంద్ర సరస్వతీస్వామివారు వ్రాసిన గ్రంథములను సేకరించి మండలి ప్రకటింప బూనుకొనుట మీరు ఎరిగిన విషయమే. ఇదివరలో 'అవధూతవాణి', 'అవధూత సూక్తులు' అను రెండుపుస్తకములను వెలువరించితిమి. ప్రస్తుతము మీచేతిలో నున్నది అవధూత లేఖలు. ఇవి వివిధ కాలములలో స్వాములవారు పరిచితులకు, శిష్యులకు, సాధకులకూ వ్రాసినవి. లేఖలలో స్వాములవారు ఎన్నో సాధనాంశములను అరటిపండు ఒలిచినట్లు వివరిస్తారు. వారు చెప్పేది చిలుకపలుకులుకావు. జీవితంలో తాము సాధించిన ప్రక్రియలనే, శాస్త్రబోధనలనే, లేఖలలో నిబద్ధం చేశారు. ఈలేఖలు సాధకులకు మననీయములు. శిరోధార్యములు. ఆచరణీయములు.

ఏక ఏవాగ్ని ర్బహుధా సమిద్ధా
ఏకం సూర్యో విశ్వమనుప్రభూతః
ఏకైవో సః సర్వమిదం విభాతి
ఏకం వైదం విబభూవ సర్వం.

ఒక్క అగ్ని వివిధములుగా ప్రజ్వరిల్లుతున్నాడు. ఒక్కసూర్యుడు విశ్వాన్నంతా వెలిగిస్తున్నాడు. చీకట్లను పారద్రోలుతున్నాడు. అందరి హృదయాకాశములలో ప్రకాశించే పరమాత్మ ఒక్కడే. మహాత్ములు ఎన్నివిధములుగా బోధించినా, చెప్పే తత్త్వమేమో ఒక్కటే, అన్నీవిని, జీర్ణించుకొని జీవితాలను సుసంపన్నములు చేసుకొని భగవన్మయము లయ్యేటట్లు మనము చూచుకోవాలి. ఇట్టికృషికి 'అవధూతలేఖలు' సహాయకారి. గ్రంథముద్రణకు ఆర్థిక సహాయముచేసిన వదాన్యులకు మండలిప్రణతులు.

భక్తులు పంపినలేఖలు చాలవరకు ప్రచురించినాము. కొందరికి అధికముగావ్రాసిన లేఖలు కొన్నిమాత్రమే ప్రకటించితిమి. స్వామివారు భక్తులకువ్రాసిన లేఖలలో చాలవరకు వ్యక్తులపేర్లకు బదులు హరేరామ్, వాసుదేవ! అను భగవన్నామములను వాడిరి.అట్లేముద్రించితిమి. శ్రీవారు లేఖలచివరకూడ వారి నామమునకుబదులు భగవన్నామమె వాడిరి. అటులనే ఉంచినాము. శ్రీవారిలేఖలు ప్రచురించవలసినవి ఇంకనుగలవు. భక్తులసహకారముతో వానినిగూడ ప్రచురించాలనికోరిక.

తెనాలి
పింగళ-వైశాఖము
1977

ఇట్లు
**బులుసు సూర్యప్రకాశశాస్త్రి**
వ్యవస్థాపకులు - సాధన గ్రంథమండలి.

వాసుదేవ ।

హరేరామ హరేరామ రామరామ హరేహరే!

హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే!

# అవధూతలేఖలు

శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజ్

సంకీర్తనభవన్, ఝూసి. (అలహాబాదు)

హే వాసుదేవ స్వరూపా! సంతభగవాన్! శ్రీ మహారాజ చరణకమలములకు పునఃపునః జయజయమగుగాక ఓం నమో నారాయణ!

నేను తమసన్నిధికి వచ్చినపుడు భగవద్విషయకములగు సంలాపములు చేయతలచెడివాడను. కాని తమను దర్శించినంతనే అంతయు మరచిపోయెడివాడను. తామొనరించెడి యర్చనము, శ్రవణము, భగవత్కథానిష్ఠ చూచి ముగ్ధుడనయ్యెడివాడను. ఈమారు తాము సాక్షాత్తుగ 'ఏకాదశస్కంధ' స్వరూపులని నా బుద్ధికి నిశ్చయమయ్యెను. అనగా, తాము శ్రీకృష్ణపరమాత్మయే, ఏకాదశస్కంధమును జూచినకొలది నాకీ భావము దృఢమగుచున్నది.

క్రిందటిమారు, 'ఝూసి' వచ్చితిని. పదమూడు దినములుంటిని. ఆ రోజులలో తమయందు, తమ వచనము

లందును శ్యామసుందరమూర్తియగు కృష్ణపరమాత్మయే నాకు గోచరమయ్యెడివాడు. నేను తమను చూచియు, తమ వచనములను శ్రవణ మొనరించియు, లోలోన ముగ్ధుడనగుట తప్ప మరేమియు నెరుగను!

ఇప్పుడు 'నా యీ భావము వ్యాపక మగుగాక' యని తమచరణసరోజములకు కరయుగళము జోడించి ప్రార్థించు చున్నాను. నామనసునందలి యీ భావము 'సత్యమగుగాక' యని తాము మనసా సంకల్పించినచో నాయీ యభిలాష సఫలమగును. ఏలనన, 'సాధు-సంత' పురుషులు ప్రత్యక్ష భగవత్స్వరూపులేగదా! ఏకాదశస్కంధమునందు నాయీ నిష్ఠ, శ్రద్ధ స్థిరముగా నుండునట్లు యాశీర్వదింప ప్రార్థించు చున్నాను.

తాము మూర్తీభవించిన భగవత్స్వరూపులు! ఈ యర్ధరాత్రిసమయమున తామీరీతిగ నెందుకు దర్శనమిచ్చు చుండిరో! తెలియదు! భాగవతములో నెన్ని యనుష్ఠాన విధానములు చెప్పబడియున్నవో అవియన్నియు తమస్వరూప ములో గోచరించును. రహస్యము స్పష్టము చేయుదునా? అనగా, తాము శ్రీకృష్ణపరమాత్మ స్వరూపులు! శ్రీకృష్ణ పరమాత్మ! శ్రీకృష్ణపరమాత్మ! కాని, నాయీభావమును తామంగీకరించెదరో, మమ్ముల నింకను మోహములో ముంచి వేసెదరు! ఒకవేళ అంగీకరింపరో, భాగవతమును అసత్యమని నిరూపింపజాలరు. మరియు 'సంతవాణి' యెన్నడు నసత్యము కాజాలదు! కాజాలదు!

వాసుదేవా! తను యీచరణకమల యుగళము నొక మారు నాశిరముపై నుంచుము. ఆహా! అమితానందము! మహానందము!

"భూయాత్ సదాంఘ్రి రజభాజయ ధూమకేతుః"
భక్తి భక్త భగవంత గురు చతురనామ్ వపుఏక్"

అని తాముకూడ అనేకపర్యాయములు చెప్పియున్నారు.

సంతభగవాన్! వాసుదేవ! తమ చరణకమలములకు పునః పునః జయమగుగాక!

వందౌ సంతసమాన్ చితహిత అనహిత సహికో ఇ।
అంజలిగత శుభసుమన జిమి సమసుగంధ కరదో ఇ॥

తమ
— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.
సాధన గ్రంథ మండలి,
తె నా లి
11-4-1975



మహాత్మా శ్రీరమణాశ్రయీజీ.
ఓం నమో నారాయణాయ.

నగరిలో మీరు ఒక మాట అన్నారు: ఉంచదలస్తే ఉంచుతాడు. ఇష్టం లేకపోతే అవతల ఒక సెకండు ఆలస్యం

కూడ లేకుండా పారవేస్తాడు.'' ఆ మాట సర్వదా సత్యము కదా !

''జగద్భావం పరిత్యజ్య బ్రహ్మమాత్రత్వ భావనా,
వాసనా ప్రక్షయోపాయః సులభ స్సూరిసమ్మతః''

అపీతకుచాంబారుణాచలేశ్వరునకు సాష్టాంగ వందనములు.

— అవధూతేంద్ర సరస్వతి.

---

మహాత్మాజీ !

నాకు ఈ శరీరం మళ్ళీ నడిచేస్థితివస్తే 'అరుణాచలశివ' అని అక్షరానికి ఒకటి చొప్పున మెల్లగా ఏడు ప్రదక్షిణాలు చేయాలని మీకువ్రాస్తూ ఇప్పుడే తోచింది.

శివా ! శివరాత్రికైనా ఆ భాగ్యం ప్రసాదించవా అరుణాచలా !

"తుభ్యం మహ్యమనంతాయ మహ్యతుభ్యం శివాత్మనే,
నమోదేవాదిదేవాయ పరాయపరమాత్మనే"

"జపో జల్పశ్శిల్పం సకలమపి ముద్రావిరచనా
గతిః ప్రాగక్షిణ్య క్రమణ మశనాద్యాహుతివిధిః,
ప్రణామ స్సంవేశ స్సుఖమఖిలమాత్మార్పణదృశా
సపర్యా పర్యాయ స్తవభవతు యన్మే విలసితమ్‌॥"

— అవధూతేంద్రస్వామి.

వాసుదేవ ! మహాత్మారమణా శ్రయాజీ !

సత్పురుషుల అనుగ్రహమున అస్తిభాతిప్రియముకంటే అన్యము అనేమాట తోచకుండా ఉండే స్వరూపంలో పడేసి ముంచుతున్నారు. ఉమా, భారతి-ఇరువురూ నా అంగ ప్రదక్షిణాతో 'తవాజ్ఞాచక్రస్థం' అనే శ్లో కము వినిపించుతూ అపీతకుచాంబ ఒడిలో దొర్లుతున్నట్లు నాకు అనుసంధానం చేయిస్తున్నారు. పరమా నందముతో అమ్మ ఒడిలో ఓలలాడి పోతున్నా.

— అవధూత.



రాజమండ్రి
30 1 74

మహాత్మాజీ !

శ్రీ అరుణగిరికి నా అనంతప్రణామములు. శ్రీ అరుణగిరి రమణునకు అనంత ప్రణామములు. శ్రీ అరుణగిరి రమణానందులకు నా అనంత ప్రణామములు.

నామసంకీర్తనే యుక్తాః ప్రేమవిహ్వల మానసః,
యత్ర గచ్ఛతి తత్రైవ మంగలం వితనోతిసః.
నామసంకీర్తనే యస్య భవే న్నైసర్గికీ రతిః,
గృహస్థోపి నిరాసక్తో బ్రహ్మజ్ఞో భవతి భక్తిమాన్.
భో హేనామ నమ స్తుభ్యం భగవాన్ కరుణాకరః,
దేహే దివ్యరసాస్వాదం తా మహం శరణం గతః,

శారీరకంగా బాధలు వచ్చినపుడు మీ తితీక్ష, భగవచ్చింతన గుర్తుకొస్తుంటుంది. 'ఆగమాపాయినోనిత్యం' అనేది గురుకరుణవల్ల మీకు బాగా వంట పట్టింది. అఖండానందులవారు సంగం అంటే వాసనన్నారు. సంగం పోవాలంటే సత్సంగం. వాసన పోవాలంటే ఉపాసన చేయాలి. ఈ మాటలు నాకు బహుసొగసుగా తోచుచున్నవి. నిజమే. సంగం శరీరంతోనే కదా! ఏది ఏలాఉన్నా సుఖదుఃఖాలకు అతీతమైన ఆనందమే 'నేను' అను స్ఫురణ కలుగుచున్నది.

భగవన్నామ మార్గగాములకు సంబళం నామజపం. దానివలన భుక్తి, ముక్తి, మోక్షం అన్నీ అరచేతికొస్తుంది. మృతత్వం తొలగి అమృతత్వం సిద్ధిస్తుంది. నాలుకలోని అసత్యం అనే మైలపోవాలంటే హరినామమే మందు. తీర్థోదకాలతో పోదట. క్రియాకర్మ ధర్మల చింతమాని నామధనాన్ని పుంజుకొన్నవారు ధన్యులు. నామం అమృత నిధి. ఖజానా. వాసుదేవ !

సమాశ్రితా యే పదపల్లవప్లవం
మహత్పదం పుణ్యయశో మురారేః,
భవాంబుధి ర్వత్సపదం పరంపదం
పదం పదం యద్ విపదాం నతేషాం.

సంతసేవా చరణ పిపాసి.
—— అవధూతేంద్ర సరస్వతి.

న్యూ ఢిల్లీ
20-3-75

వాసుదేవస్వరూపా.

శరీరారోగ్యం ఇదివరలోలాగుననే భజనకు బలం ఇచ్చుచున్నది. అందరిదృష్టిలో క్షీణించుచున్నట్లుగా శరీరారోగ్యం కనబడుచున్నది. దేహస్వభావం దానిది. అయితే 'నేను ఎప్పుడు అపరిచ్ఛిన్నమే'గదా! ఆ అపరిచ్ఛిన్నమైన నేనునే ఎన్నో విధములుగా వాడుకొనుచున్నాను.

వాసుదేవ-పునః అందరికీ నారాయణస్మరణములు.

— అవధూతేంద్ర.

---

హరేరామ హరేరామ రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే.

శ్రీ కనకరాజుగారు - నారాయణస్మరణలు.

శ్రీ వెంకటేశ్వర వజ్రకవచమున అక్షరములు రెండు పాదములలో ఈ క్రింది ప్రకారము ఉండవలెను.

3, వ శ్లోకము మొదటి పాదము-

ఆకాశరాట్ సురానాథ ఆత్మానం మే సదాఽవతు.

5, వ శ్లోకము రెండవ పాదము-

"సాయంప్రాతఃపఠేన్నిత్యం మృత్యుం తరతినిర్భయం" అందున్న ప్రకారముగాక పై ప్రకారము చదువవలెను.

యస్య ప్రసాదా దహమేవ విష్ణుః
మయ్యేవ సకలం పరికల్పితంచ,
ఇత్థం విజానామి సదాత్మరూపం
తస్యాంఘ్రియుగ్మం ప్రణతోస్మినిత్యం.

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.



7—2—75

వాసుదేవస్వరూపా!

నారాయణ స్మరణలు. దోషములున్న తెలుపు మనికి. వాసుదేవ! అది చదవగానే నాకు ఈ దేహవిష యంలో ఆలోచన వచ్చినది. ఏమన ఏమందు పనిచేస్తుందో, ఏవైద్యుడు రక్షిస్తాడో అను చింతన ఉండటం ఈ ఆశ్ర మానికి పెద్దదోషం. నా ఈ సమయమంతా ఇలాగే గడచిపోతే, లక్ష్యంలోంచి చ్యుతమైన ట్లేగదా! గోవిందా - ఈ మనస్సు ఇలాగే మోసం చేయిస్తుంది. మోసంలో పడేస్తుంది. దానికి విరుగుడు ఆ రామనామమే అందరికి గతి అని చాటినారు.

వాసుదేవ! నిత్యము చేసుకోవలసిన భగవదనుష్ఠానం యథావిధిగ ప్రమాదం లేకుండా జరిగినంతకాలం అంతా మంగళ ప్రదంగానే, దోషరహితంగానే గడుస్తుంది. భగవత్ విస్మరణే దోషం. విపత్తు. అది మరవకుండుటే సంపద, నిర్దోషము.

జయతు జగన్మంగళం హరేర్నామ

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

8—7—74

వాసుదేవస్వరూపా !

నారాయణ స్మరణలు

నిత్యము, సకాలములో సహస్రగాయత్రి చేసినటువంటి బ్రాహ్మణునకు స్వర్గవాంఛ పోతుంది. సకాముడు అకాముడౌతాడు. ఆత్మజ్ఞానం 'రతలామల'ం ఔతుంది. ఈ విషయంలో పూర్తి భోగట్టా - మహాత్మా శ్రీ రమణాశ్రయి వారి ద్వారా మీకు నిరంతరం అందుతూనే ఉంటుంది. వారికి ఓం నమో నారాయణలు. ప్రియసీలుకు నారాయణ స్మరణలు. భగవంతుని పూర్ణస్వరూపానుభవప్రాప్తికి ముందు విభూతులను అత్యంత శ్రద్ధతో ఉపాసకుడు సేవించుచుండవలెను అట్టి విభూతులలో తల్లి, తండ్రి, గురువు, దైవము మొదలగు విభూతులను ఆదరముతో సేవించుచుండువానికి అసలు విభూతి ఐనటువంటి ఆత్మ త్వరలో అనుభవమునకు రాగలదు. విభూతులను భగవంతునిగా చూడనివాడు ప్రపంచమును పరమాత్మగా ఎట్లు చూడగలడు? గోవును, గార్దభమును బ్రహ్మగా ఎట్లు చూడగలడు? కావున మాతృదేవో భవ, పితృదేవోభవ - వీరే ప్రత్యక్ష దేవతలు. వీరిని సేవించినవారికి భగవదనుగ్రహము అతి సమీపము. వాసుదేవ !

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.



29–5–74

వాసుదేవస్వరూపా!

నారాయణస్మరణలు

"అపబల తపబల ఔర బాహుబల హారేకో హరినామ"- అని శ్రీ సూరదాసుగారనినట్లు మనోవాక్కాయకర్మలతో మందులు తీసుకొంటున్నా. అసలు ఆత్మబలం కావాలని తెలుపుటకై ఈ అరుణాచలేశ్వరుడు అనుగ్రహాస్త్రమువేసి లాగి ప్రదక్షిణములు చేయించుకొంటున్నాడు. అంతులేని అనుగ్రహానికి ప్రత్యక్షనిదర్శనమే. మనవ్యాధితో లేవలేని మహాత్మారమణాశ్రయిగారిని తోడుచేసి నా ఆశ్రయబలం ఇలాగుంటుందని చూపుటకుగాను నాకండగా వారిని ఇచ్చి అంతులేని ఆనందాన్ని అనుగ్రహించుటకై లాగికొన్నారు. 21 న ప్రదక్షిణలు మొదలెట్టాము. ఈ దినం ఆరో ప్రదక్షిణ. దీనినిబట్టి చూస్తే-40 న్నీ మూడు మాసములలోగా విరామం తీసుకొంటూ చేయిస్తాడని తోచుచున్నది.

మార్చి 21 నుంచి తిరుగుతున్నాను. 2 సప్తాహములు జరిగినవి. సంకీర్తన బాగా జరిగినది. 19 రాత్రికి అరుణాచలం చేరాము. మహాత్మా రమణాశ్రయిగారి శరీరస్థితి ఆలాగే యున్నది. కాని ఆనందంగా ప్రదక్షిణలు చేస్తున్నారు. శివసంకల్పం చేయించి, శివమయంగా అనగా తానుగా ఉండుటకేమో ఈపన్నాగం, ఈ అవ్యాజకరుణ, ఈ అనుకంప, ఈ వాత్సల్యము.

శివమహాదేవ వాసుదేవ హరి-

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

16-2-74

వాసుదేవ స్వరూపా - నారాయణ స్మరణలు

రేపు శివరాత్రి. ఏ సమయంలో దేహబుద్ధిగలచోట దైవబుద్ధివుంటుందో, ఆ రాత్రులన్నీ శివరాత్రులే. అనగా మంగళమయమగు రాత్రులే.

మానవులకు సాధన, కేవలం శివమయం అని తమ్మొ తా తెలిసికొనుటకేగానీ మరిఒకందులకు గాదు. అని గురువులు మనకు శాస్త్రం అందించినమాట చెప్పుతారు. భగవత్స్మరణతో జరిగేపనులన్నియూ శివమయమే.

కాని మనకు సహజం అసహజం అయింది. అసహజం సహజం అయింది. ఇప్పుడు దృఢమైన అభ్యాసబలంచేత సహజాన్ని అందుకోవటమే మనం చేయవలసినపని. పుణ్యం అధికమైనకొలది సహజం సులభంగా హస్తగతం అవుతుంది.

పుణ్య ఏక జగ మహు నహోదూజా,
మన క్రమ వచన రామ పదపూజా.

భగవాన్ శ్రీరాముని త్రికరణములతో కీర్తించుటయే ఉత్తమపూజ. అందరికీ నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతి స్వామి



అరుణాచలం

15-8-74

వాసుదేవ స్వరూపా!

నారాయణస్మరణలు

సాధ్యము అన్యము, తాను అన్యము అను భావనగల వారికే సాధనలో పరిశ్రమ జనించును. "నిరంతరము నా ఇష్టదేవుని ఒడిలోనే వుంటున్నాను. ఆయననే అంటి పెట్టుకొని ఉన్నాను-అనెడు నిస్సంశయనిష్ఠ కలిగి యుండుటయే ఉత్తమభజన అని గీతా వాక్యము. భౌతికమైన వస్తుప్రాణుల యందు గల మమకార ఆసక్తులు జగత్పిత సంతానములందు పెంచుకొనినచో, ఆత్మోద్ధరణము జరుగును. దానికి ప్రాతిపదిక తన వస్తువులు, తన ప్రాణులు భగవత్పరమే యని నిశ్చయబుద్ధితో ప్రవర్తించుటయే. అదియే అత్యుత్తమ కోటికి చెందిన సాధనము.

అరుణాచల మహాప్రసాదమే పై విధముగా మీకు అందించుచున్నాను. గిరి ప్రదక్షిణముతోబాటు అంగ ప్రదక్షిణకూడ అరమైలు జరుగుచున్నది. శివ గిరి ప్రదక్షిణ సేవ జరుగుచున్నది. ఇచ్చట అనేకులకు నా విషయములో - 'సన్యాసికి ఇంత స్థూలసాధనమా?' అని శంక కలిగించుచున్నది. కాని ఈ స్వామి దృష్టిలో - చేయుట, చేయువాడు, చేయించేవాడు 'నేనే' నని అవ్యభిచారనిష్ఠ గురువనుగ్రహమున కలిగి యున్నది. ఇదియు మహాత్ములు, సద్గురు కృపయే అయి ఉన్నది.

6-9-74 న అరుణాచల శివసప్తాహము ప్రారంభించి జరుపబడును. 14 న మంగళహారతి. శ్రీ రమణాశ్రయిగారి యొక్క దృఢసంకల్పము. ఆరోగ్యమేమిటి? అనారోగ్యమేమిటి! ఈ పురుషోత్తమమాసంలో జరిగి తీరవలసిందే అని తెలిపినారు. ఇలాగే అరుణాచలేశ్వరుడు తమ అనుగ్రహాన్ని వర్షింపజేస్తున్నాడు. గుర్తించినవారు వారి ఒళ్ళోనే యున్నామని ఉవ్విళ్ళూరుచున్నారు. అందరికీ నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతి స్వామి.

---

వాసుదేవ స్వరూపా!

భగవదనుగ్రహమున నీవు పంపిన M. O అందినది. ఇది చూచి నాకు లోభమధికమైనది. రాంబాబుకూడ పంపినాడు కదా! దీనినిబట్టి ఇక్కడ అరుణాచలునకు గిరికి అంగప్రదక్షిణములు చేయుటకు ఉత్సాహము అధికమయినది.

అంగప్రదక్షిణము దొర్లుతూ చేయవలెను. అలా కేవలం కౌపీనంతోగాని దిగంబరత్వంతోగాని జరగాలని. 90 దినములు లేక 100 దినములు పట్టవచ్చును. శ్రీ రమణాశ్రయికి చాలసుస్తీగా యుంటున్నది. రోజుకు 101 డిగ్రీలు వస్తున్నది. దానికొరకు దక్షిణాదికి 11 వ తేది వెళ్ళి, తిరిగి యిక్కడికి రాగలము.

తిరిగివచ్చినతర్వాతనే అంగప్రదక్షిణము ప్రారంభము కాగలదు. తదనంతరముకూడ 21 డిసంబరు వరకు ప్రదక్షిణసేవ గిరికి జరుగుతూ యుండగలదు. ఈ జన్మంతా చేసినకృషికి ఫల మిదియే యని నాతలంపు. నేననగా ఎట్లు బ్రహ్మమో గిరి యనగా కూడా అదే పరమార్థము.

వాసుదేవా! ఇంకా నీ ఉద్యోగ మెంతకాలమో తెలియదు. ఏ రూపముగాగాని ఇంతవరకు బ్రహ్మచర్యంతో జీవితం గడచినది. ఇంకా భగవదండను గట్టిపరచుకొంటూ, మిగిలిన జీవితంకూడ అలాగునే గడుపుకొనుటకు దృఢసంకల్పముతో వుంటే దాన్ని మరింత దృఢం భగవంతుడు అండగా ఉండి నీకు చేయూతనివ్వగలడు. ఈ సృష్టిలో అంతవయగలవారు మరెవ్వరూ లేరు - లేరులేరు, అంతా స్వార్థులే. సద్గురువూ, భగవంతుడూ తప్ప, గురువులుకూడ స్వార్థులే. గాన నీకు రెండూ భగవంతుడే.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

శ్రీ కనకరాజుగారికి-సకుటుంబముగా నారాయణస్మరణలు.

భగవానుని అనుగ్రహమువలన 1 మాసంరోజులలో ఆరోగ్యంతో భగవన్నామ సంకీర్తన చేయగలనని తలచుచున్నాను. పరమార్థతః యేవిచారమూ మనస్సులో లేదు. శరీరాలు అస్థిరాలు. శరీరి సుస్థిరుడు. యతుల విషయంలో యేదైనా మంగళమే-'యతీనాం మరణం మంగళం,అన్నారు. అస్తు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

వాసుదేవ :

శ్రీ భగవన్నామముయొక్క అనుగ్రహమువలన అమృతస్వరూపుడనైన నేను ఆనందముతోనే యుంటున్నాను. అందరూ అంతే. మృతమైన దేహానికి అతీతులే. అమృత స్వరూపులే. స్వరూపమే. ఉపాధులద్వారా బహువచనం గాని ఏకమే అనన్యమే - అద్వయమే-అఖండమే - ఆ నేను. నారాయణ స్మరణలు

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

---

హైదరాబాదు
13 4-75

వాసుదేవ : నారాయణ స్మరణలు.

సకాలంలో నీజాబు శ్రీశైలంలో జగన్మంగళమైన హరినామసప్తాహంలో అందినది. ఆ హరినామం అండతోనే ఇప్పుడో ఎప్పుడో ఊడుతుందని తోచే శరీరంతో అద్భుతంగా ఆ పరమాత్మ సంకీర్తనల సేవ చేయించుకొంటున్నాడు. గాన ఆయన ఇష్టంలేకపోతే రాయివంటి శరీరం కూడ రెప్పపాటుకాలం ఉండదు.

నారాయణ! ఆయన ఉంచదలిస్తే ఊడిపోతున్నట్లున్న శరీరంతోనే అద్భుతంగా సేవలు చేయించుకొంటాడు. జీవునికి ఉత్తమసేవ భగవన్నామం మరువక యుండుట. సర్వేశ్వరుని నామారాధన సర్వలోకాలవారికి మంగళప్రదమగు అద్వి

త్రీయసాధన, అదియే నీకు సపరివారంగా శ్రీరామరక్ష, చింతఏల ?

సోమసూర్యాగ్నులను మించిన స్వప్రకాశము రామనామము.

అవధూతేంద్ర.

---

తాడేపల్లి గూడెం
18 × 68

నారాయణ స్మరణలు !

మీరు ఎంతో జిజ్ఞాసతో వ్రాసిన విషయాలన్నీ చదివాను. కలిప్రభావంవల్ల మధ్యమధ్య సాధకులకు నిరుత్సాహము జనిస్తూ వుంటుంది. కాని దానికి మీరు ప్రతిదినము సేవిస్తున్న శ్రీమద్భాగవతం అమోఘ ఉపాయమని నా దృఢ విశ్వాసం. శ్రీ మద్భాగవతం తాపత్రయోన్మూలకమని ఘంటాపథంగా చెప్పినారు. మీ ఉత్తరం వచ్చినప్పటినుంచీ ఏకాదశ స్కంధమును చూస్తున్నాను. 2వ అధ్యాయము 36 శ్లోకంలో - భాగవతధర్మం పాలించేవ్వారికి ఒకనియమంకానీ, విశేషకర్మ కాని లేదు - శరీరము, వాక్కు, మనస్సు, ఇంద్రియములు, బుద్ధి మరియు అహంకారము ద్వారా స్వభావ వశులై ఏఏ కర్మ చేస్తున్నారో, వానినంతటినీ పరమపురుషుడైన భగవాన్ నారాయణునికే అన్న భావనతో అర్పించవలెను అని ఉపదేశింపబడినది. నాకు ప్రియమైనవి ఏకాదశ స్కంధములో 28, 29 అధ్యాయములు. 28 వ అధ్యాయములో చెప్పినది సాధ్యముకా పోతే 29 వ అధ్యాయములో

పరమ మంగళ భాగవతధర్మాన్ని కృష్ణుడు ఉద్ధవునికి ఉపదేశించినాడు.

భాగవత ధర్మమును శ్రద్ధతో ఆచరించిన మానవుడు సంసారమనే మృత్యువును అనాయాసముగా జయింపగలడు. 11 వ స్కంధము 29 వ అధ్యాయము 12 వ శ్లోకంనుంచి 20 శ్లోకంవఱకు చెప్పబడినవానిని నిత్యమూ నియమముతో చేసిన ఈ జన్మకు మహోపకారం. గృహస్థధర్మంలో ఉంటున్నారు. కనుక, ముందు 15 నిముషములతో ప్రారంభం చేయండి. ఈ ధర్మంలో ఉన్న సాధకుడు, శోకభయమూలకములైన నిరర్థక కర్మలు చేసినా, నిష్కామభావంతో అర్పణ చేసినామంటే, అవి ప్రసన్న ధర్మములగును. వినాశశీలియు అసత్యమును అగు శరీరంద్వారా అవినాశకరమైన సత్యతత్త్వమును మనం అన్వేషించాలి వివేకుల వివేకము, చతురుల చాతుర్యమూ ఇందులోనే వుందని శ్రీముఖము.

"సాధకుడు ఉత్సాహంగా ఉండాలి. అన్నియు ఎరిగియుండియు, విషయములను వదలినవాడు శ్రద్ధతో నన్నే భజించవలెను. సమస్తకర్మ త్యాగము చేసినవాడు నాకు మాననీయుడు. అట్టివానిని నేను అమృతస్వరూపునిగా చేసెదను. అతడు నా స్వరూపమే"-అని భగవంతుడు బోధిస్తున్నాడు. ప్రతిముద్దకు, ఆకలితీరుట, పుష్టికలుగుట, తృప్తి అగుట ఎట్లు జరుగునో అట్లే ఈమార్గంలో వెంటవెంటనే అన్నిలాభములూ కలుగును-అని భగవదాదేశము—

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

నారాయణస్మరణలు—

ఒకమాసంరోజులు ఇక్కడ ఉండి మందుతీసు కోవాలి. ఈలోగా దూరప్రయాణం చేయజాలను. ఈసారి నన్ను విశ్రాంతిగా ఉండనివ్వండి.

ఒకసారి శ్రీరామజయరామమునుగురించి శ్లోకమును అడిగిరి. అదివ్రాస్తున్నాను. అవి రెండురకాలు,

శ్రీరామేతి పదం చోక్త్వా జయరామ తతః పరం
జయద్వయం వదే త్ప్రాజ్ఞో రామేతి మనురాజకః॥

ఇది ఉపనిషత్తులోనిది.

శ్రీశబ్దపూర్వం జయశబ్దమధ్యం జయద్వయేనాపి పునః ప్రయుక్తం,
త్రిసప్త కృత్వో రఘునాథనామా ద్విజాన్ని హత్యాన్ శతకోటిహత్యాన్.

మోక్షకామునకు మోక్షంబు సిద్ధించు,
భవభయంబులెల్ల బాసిపోవు
యోగి సంఘమునకు నుత్తమవ్రతములు
వాసుదేవనామవర్ణనములు.

— అవధూతేంద్ర సరస్వతి

---

వాసుదేవ స్వరూపా!

సగుణమైనా నిర్గుణమైనా అంతా బ్రహ్మ స్వరూప మనియేకదా! అట్టి భావము హరినామములో సర్వత్ర వ్యవహరించిన ఎందుకు దృఢముగాదు? ఇల్లు శివుడైతే జగత్తు శివుడే - జగత్తు శివుడైతే ఇల్లుశివుడే - హరహర మహాదేవ—.

భగవతి తవతీరే నీరమాత్రాశనోహం
విగతవిషయతృష్ణ కృష్ణమారాధయామి,
సకలకలుషభంగే స్వర్గసోపానసంగే
తరత తరతరంగే దేవి గంగే ప్రసీద,

— అవధూతేంద్ర సరస్వతి.



వాసుదేవా ! 24 July 64

కా 8

శ్రీరామ రామనామము మూరాడక వినునరునకు మహితాత్ముడవై,
యూరూరదిరిగి సెప్పుమి యారూఢతపః ఫలంబు లగు వేమపతీ.
శ్రీరామ యనెడు మంత్రము తారకమనియెరిగి మదిని ధ్యానపరుండై,
సారము గ్రోలిన నరునకు చేరువగును పరమపదము చేకురువేమా.

రఘువర తవమూర్తి ర్మామకే మానసాబ్జే
నరకగతిహరంతే నామధేయం ముఖేమే,
అనిశమతులభక్త్యా మస్తకం త్వత్పదాబ్జే
భవజలధినిమగ్నం రక్ష మా మార్తబంధో॥

ఔపాధికముగా కంచి, తిరుపతి, శ్రీరంగం, శ్రీరామేశ్వరం సేవ జరిగినది - భక్తులందరికి నారాయణ స్మరణలు. ఊర్ధ్వగతిని పొందు ఉపాయము - శ్రద్ధ, భగవద్భక్తి, ప్రేమ, సానుభూతి. అధోగతి లక్షణములు - స్వార్థపరత, భోగేచ్ఛ, సోమరితనము. అత్యుత్తమ స్థితి-నిరంతర భగవన్నామజపం.

— అవధూత,

హరేరాం నారాయణస్మరణలు ! గోలోకబృందావనం

29—4—65

శ్రీ రమణాశ్రేయికి సురుపు చాల భాగము తగ్గినది. ఇంకా కొంచెము గట్టిగా వున్నది. ఈ రోజు స్నానంచేశారు. ప్రేమతో భాగవతమును చదువుతున్నారు.

మీ ఉత్తరం చూచి చాల ఆనందంకలిగినది. ఎచ్చట సమస్తతీర్థములు, దానములు, కర్మయొక్క ఫలమువలన లభించునో అట్టి సత్పురుషుల దర్శన సల్లాపభాగ్యము మీరు పొందుచున్నారు. ఆ ఘడియలే ధన్యములు. ఆ స్థలములే పూతవంతములు. "సంతసంగ అపవర్గసుఖ"—

ముక్తేర్హేతుర్ద్వయం హరిశ్చ హరినామ చ,
హరిశ్చ భక్తిం వాంఛేత హరినామనకించన.

— అవధూతేంద్ర సరస్వతి.

---

హరేరాం !

నిన్ననే శాస్త్రిగారు ఉత్తరంవ్రాశారు తండ్రిగారు శరీరమును చాలించారని. ఈశ్వరేచ్ఛను ఎవరు ఉల్లంఘించ గలరు ?

సమంపశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం,
నహి న స్త్యాత్మనాత్మానం తతో యాంతి పరాంగతిమ్.
బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్యచ,
శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యైకాంతికస్యచ. (గీ.13.అ)

— అవధూత.

నారాయణ స్మరణలు ! 18—6—72

మీ భగవదనుసంధానం నిత్యమూ నిర్విఘ్నంగా జరుగుచున్నది కదా ? 'లాభ స్తేషాం' అని చెప్పిన మాట పరమసత్యము. 'సంపత్తిస్సైవ సంస్తుతిః, వ్యవహారంలో ద్వంద్వం ఉండనే వున్నది. వ్యవహారం అంటేనే మార్పు గలదని అన్నారు. పరమార్థంలో మార్పు అనే ప్రసక్తేలేదు. నిర్దోషం, నిర్దుఃఖం, నిత్యానందంగదా ! అందుచేత నిర్విచారంగా ఉండుటవలన, సత్సంగలాభం అమితంగా లభించును.

— అవధూతేంద్ర సరస్వతి.

---

వాసుదేవస్వరూపా ! శా స్త్రీజీ గుంటూరు

ఆరోగ్యం భజనకు సుముఖంగానూ, భోజనానికి విముఖంగానూ ఉంటున్నది. శ్రీరమణాశ్రయిగారు, నీలుగారు అక్కడనే ఉన్నారు. 26 జనవరి భద్రాచలం వస్తారు. ఆ దినం సప్తాహం ప్రారంభం. మీరు తప్పక ఆ 7 దినములు వచ్చి వుండవలెను. అందరికి నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

వాసుదేవ !

తుభ్యం మహ్య మనంతాయ మహ్యంతుభ్యం శివాత్మనే,
నమో దేవాదిదేవాయ పరాయ పరమాత్మనే.
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమః,
నమోఽకించన విత్తాయ స్వాత్మారామాయ.
కైవల్య పతయేనమః !

నేను దేహమను బుద్ధియే నరకము. అదికలవాడే నరకుడు. దానిని నశింపజేసుకొని స్వయంజ్యోతి యగు ఆత్మగా వెలుగుటే దీపావళి పండుగ. దేహాత్మభావమును వదలుటయే నిష్ఠ, ఆనందము. 6–9–74 నుంచితిరువన్నామలైలో సప్తాహం ప్రారంభం. 13 వ తేదీ మంగళహారతి. 29 శ్రీరమణాశ్రయివారు తిరువణ్ణామలై చేరుతారు.కొంచెం జ్వరంవస్తోంది. చాల నీరసించినారు. నా శరీరానికి మందు ప్రదక్షిణలే. నేను 30 వ తేదికి తిరువణ్ణామలై చేరుతాను.

విష్ణుం నారాయణం కృష్ణం మాధవం మధుసూదనం,
హరిం నరహరిం రామం గోవిందం దధివామనం.

అందరికి నారాయణ స్మరణలు

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

శ్రీ వెంకట్రామయ్యగారు, (మోగల్లు) పొన్నూరు 9–2–57

నారాయణస్మరణలు

నా శరీరమున యింకా పూర్తి ఆరోగ్యము గలుగలేదు శరీరము, దేహము అని పిలుస్తారు. అనగా జీర్ణించునది. దహింపబడునది. అటువంటి దీనికోసము సన్యాసమునకూడా చింతించవలసి వస్తోంది. అవ్యక్తంగా యేమూలనైనా శరీరమునందు లోకేషణ దాగి యున్నదేమో, నని జాగ్రతగా యుంటూనే వుంటాను అహంకార అంకురము ననే మాయ విజృంభించి, దేహబుద్ధిని గలిగించి సర్వనాశము జేయును. భగవానుడు "మమ మాయా దురత్యయా"

యని జెప్పి అనన్యచింత చేయువారి "యోగక్షేమం వహా మ్యహం" అని దృఢముగా ప్రతిజ్ఞ జేసి ముముక్షువుల సర్వ భయములను తొలగించినాడు. జీవితమున యే విప్లవము వచ్చినను స్వస్థతలేని దానికే. అనగా తనయందు ఉనికి లేని వానికే చేకూరును. జీవితమున గల్గు అనర్థములు అవి రామంగా అనురాగంతో అఖండ హరిస్మృతివల్లనే తొల గును. పై స్థితి దేశము, జాతి, శరీరములందు ఆసక్తిగలవానికి దుర్లభము. దేశాభిమాని ఇతర దేశస్థునియందు ప్రేమగా యుండడు. జాత్యభిమాని ఇతరజాతిని ప్రేమింపజాలడు. శరీరాభిమాని కూడ యేజీవునియందు దయజూప జాలడు. పరమార్థ చింతగలవాడు తనకు లభించిన ఉత్తమ సాధన తెలివి కష్టసాధ్యమున పాండిత్యము సంపాదించి అహంకార పడినవానివలె గాక పరమేశ్వరానుగ్రహ బుద్ధితో అకించ నుడై దేశ, జాతి, శరీరాసక్తి వదలి "అమానినా మానదేన, తరో రివ సహిష్ణునా" అను స్థితిని నిశ్చయంగా పొందగలడు. ఋషీకేశంలో ఒక వృద్ధమహాత్ముని సంత్సంగమున పొందిన మాటలు-అంతరంగ బహిరంగ సాధనలు నిరంతరము పార మార్థికముగానే వుంటూ ఏక్షణమునయినా తత్త్వవిరుద్ధమైన చింత పనికిరాదు, ఈక్రిందివికూడదు.

ప్రతిగ్రహము—పరులనుండి గ్రహించుట

పరిగ్రహము—సంచయబుద్ధి

ఉపగ్రహము—నాటినాటికి తిను నభ్యాసము

పరచర్చా—నిందా-స్తుతి

ఎవరు పైసాధనమును అడుగడుగున మెలకువతో ఉత్తీర్ణులవుతారో వారి వారి అనుష్ఠానఫలమును యదార్థంగా పొందగలరు. లేనిచో సర్వము దంభము. పరిశ్రమయే వారికి ఫలము. ఈమాటలన్నీ నన్ను జూచుకుంటూ వ్రాసినవి. మననార్థము యే పూట కాపూట లేనిచో పాచిపట్టుతుంది. ఇదియే సత్సంగము. అందరకు నారాయణస్మరణలు.

వాఙ్మయం ఖం హి సర్వత్ర, వాచా మూకస్య దుర్లభా।
చిన్మయం బ్రహ్మ సర్వత్ర, విద్యాహీనస్య దుర్లభమ్॥

ప్రస్తుతం శారీరకంగా ఒక వత్సరము సంకీర్తన జరుగదేమో ?

— అవధూత.



అరుణాచలం
శ్రీరామరక్ష సర్వ జగద్రక్ష 16 8-74

వాసుదేవ! వాసుదేవ స్వరూపులు, శ్రీ వెంకట్రామయ్యగారికి సపరివారంగా భక్తమండలివారికి నారాయణ స్మరణలు. తెల్పునది. వాసుదేవా! నీవు వ్రాసిన లెటరు అందినది. నాయనా నీకు దినదినమునకు ఆరోగ్యము మెరుగు పడుచున్నదని తలంతును. భగవదాశ్రయములో నున్నవారికి, రోగము అనుగ్రహరూపముగానే గోచరించును ఇట్టి సమయంలో నామము కన్నా పరమౌషధం ఇంకొకటిలేదు. అభయప్రదమును ప్రసాదించును. రోజు నీ వున్నచోటనే బృందావన భావనచేసి 108 మార్లు పరిక్రమ చేయుచున్నానని వ్రాశావు. వ్యాధి రూపంలోనున్నప్పుడు ప్రేమరూపమైన నామ, గుణ, లీలా, ధామ, సేవన, హృదయమునకు

ఎనలేని బలమును చేకూర్చును. నిరంతరము ఆర్తితో నామం చేస్తున్నాడని శ్రీ వెంకట్రామయ్యగారి ఉత్తరంద్వారా తెలిసినది. అప్పుడే భగవదనుగ్రహమునకు పాత్రులమగుటకు వీలగును. నామము నీ వస్తువుగా చేసికొనుము. నామి నీవాడు కాగలడు. నాకును, ఆ అరుణాచలేశ్వరుడే అన్ని విధములా అండదండగాయై ఇప్పటికి 70 ప్రదక్షిణములు కావించుకొన్నాడు. అంతయు అరుణాచలేశ్వరుని ఇచ్ఛయే. ఎంతకాలం ఉంచుకొంటే అంతకాలం నాటకమాడేది. తెర పడగానే నాటకము సమాప్తము. నామం మరువకుము

— అవధూతేంద్రస్వామి.

---

శ్రీ పి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి		సంకీర్తనభవనం, బృందావనం
విజయవాడ		25-3-74

వాసుదేవునివలె, వాసుదేవుడే అపరిచ్ఛిన్న ఆత్మగా నున్న శ్రీ పి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి ఓం నమోనారాయణ.

ద్వాపరంలో భగవత్కథామృతం వీనులలో పడగానే కృష్ణ వియోగంలో చావకుండ బ్రతికి కొంతకాలానికి శ్రీ కృష్ణుని వియోగ మసంభవ మని ఆనిష్ఠ నందుకున్నారుట - గోపికామతల్లులు.

వాసుదేవ! ఈ కలిలో నామావతారంగా వచ్చిన ఆ శ్రీకృష్ణునికి అంతర్ధాన మవటం చేతకాకుండా పోతోంది. నామంద్వారా వియోగం అనేమాట మొదటిలోనే లేకుండా పోతోంది. సంయోగం కూడా అబద్ధమే. అని ఋజువవు

చున్నది. సంయోగ వియోగాలనే ఆట ఆడుకుంటున్నాడనియే గాని అన్యంగాదు.

బృందావనంలో అవతరించాడు. అనగా భూమి మీదనేగా. భూమి భగవంతుడు గాకుండా అన్యంగా ఎలా వుండగలదు. అయితే నువ్వు-నేను, ఇది-అది, వీడు-వాడు ఇక్కడ-అక్కడ, ఎప్పుడు-ఎక్కడ, అదుగో-ఇదుగో అని ఎన్నో విధాలుగా తనను తానే వాడుకుంటున్నాడు. తనయందే తాను రమించుచున్నాడు. వ్రజంలో (తనలో) తవకథామృతం ఎందుకైంది? తాను అమృతం గనుక. దేవతలు త్రాగిన అమృతంవలె పరిచ్ఛిన్నమైంది కాదు. వాసనాపూరితమైంది కాదు. దీని స్పర్శవలన దేనికి యీ లక్షణాలుండవు. అంతా ఆయన పేరుతో-ఆత్మే యుండగలదు.

అణువులలో అణువుగాను - పెద్దదిలో పెద్దదిగాను వున్నట్లు తోచుట క్రమంగా తనకు తానే అర్థమగుటకు-ఈ రకమైన నాటకం ఆడుట. బ్రహ్మాదులు మానసిక సృష్టి - మనం మైథునసృష్టిలో వారమట. ఇది తనను తననే భ్రాంతిలో వున్నట్లు నాటకమాడటమేగదా! "మమ మాయా దురత్యయా" ఇదంతా యెందుకు? నేనే దుర్లభమని చెప్పుకున్నాడుగా-మాయ యని ఇంకో పేరుగూడ యెందుకు? ఇదంతా ఆత్మవిలాసమే. అందుచేత రసవత్తరంగా యుంటోంది.

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి

పూజ్యులు శ్రీ శ్రీ శ్రీ వులిచి ఆదిశేషదాసులవారికి హైదరాబాదు
గుంటూరు

సపరివారంగా నారాయణస్మరణలు. ప్రస్తుతము భగవన్నామ సంకీర్తన సేవ యొనరించుచు యిచట ఒకమాసం నుండి వుంటున్నాను. వాసుదేవ! ఈ దినం ఒక విషయం సత్సంగంలో లభించినది. వ్రాసికొనుచున్నాను. భక్తుడు సరళమైన భగవద్రచన చింతన మనే యోగమార్గాన్ని అనుసరిస్తాడన్న సంగతి బహు ముచ్చటగా లభించినది. మద్రచనాను చింతయా! భగవంతుని రచనను శిల్పనైపుణ్యాన్ని చూడు. సూర్యుడు 2 అడుగులు భూమివైపు తిరిగితే భూమి అంటుకుపోతుంది. చంద్రుడు ½ అడుగులు దిగితే ఆటూ, పోటూతో సముద్రం భూమిని ముంచేస్తుంది. ఇది సృష్టికర్త యొక్క అద్భుతగణితం. నీకంటె కెదురుగా నున్న అద్భుతరచన యందు నీచూపుపడులేదా? నీప్రియతముడైన వాసుదేవుని రచన గాని దేమైనా యున్నదా? నారచనయొక్క అనుచింతనం యొనరించుచున్నదో ఆ నా భక్తుని దృష్టితో సృష్టిని చూడుము. ఈ సంసారం ఈశ్వరుడు యెంతో ప్రేమతో రచించాడుగాని దీనిని చూడు. దీని రచయిత అయిన పరమాత్మనూ చూడు.

భూమిని చూస్తే వరాహ భగవానుడు స్థాపించిన సంగతి గుర్తుకురావాలి. అలా వస్తోందా? రామకృష్ణులు ఆడుకున్నటువంటి పవిత్రమైనది ధరాతలం. సముద్రం భగవానుని అత్తవారిల్లు. ఇక్కడ శేషపాన్పుమీద పరుంటాడు. సూర్యమండలంలోనూ చంద్రమండలంలోనూ భగవాను

డున్నాడు. గాలి విరాట్పురుషుని శ్వాసలు. వంటిమీద గాలివీస్తోందంటే భగవంతుని మూతివద్ద యున్నానని స్మరణ గలుగుచున్నదా? ఈవిధంగా భగవత్పరమైనవి మనస్సులోకి వస్తోంటే భక్తియొక్క ప్రాదుర్భావం కలుగుచున్న దని గుర్తించుకొనుము. ఈ నేత్రముతోటే భగవద్దర్శనం అవుతుందని నమ్ముము. ఈజగత్తు యెంత సత్యమో అంతగానే పరమాత్మగూడ సత్యము.

సృష్టియొక్క రూపంతో ఈ భగవంతుని కౌశలం ఎదురుగుండాయున్నది. ఒకొక్క వస్తువులో ఆయనయొక్క విలక్షణమైన నైపుణ్యం ఉన్నది. నీటికి పన్ను ఉన్నది. వర్షంనీటికి పన్ను ఉన్నదా? శ్వాసమీదకూడ పన్ను లేదు. ఈశ్వరుడు అంతఃకరణను శుద్ధిచేశాడు. గురువు జీవన నిర్మాణం చేశాడు. శాస్త్రంవలన జ్ఞానం లభించింది-గావున వీరికి కృతఘ్నుడవైతే భగవత్ప్రాప్తి అసంభవం. అతః వీరియందు కృతజ్ఞుడవై యుండుము.

పరమాత్మ జగత్తులయొక్క తత్వాన్ని విధిపూర్వకంగా విచారిస్తే జ్ఞానం కలుగుతుంది. అన్యథా విచారిస్తే విపరీతజ్ఞానం కలుగుతుంది. భక్తి విలక్షణమైంది. ఇందులో బ్రహ్మవిచారం లేదు-మనోనిగ్రహం లేదు. వస్తువుయివ్వటం క్రియ చేయటంగూడలేదు. భక్తి ప్రేమాత్మికమైన వృత్తి. ఒకొక్క పదార్థం ఒకొక్క క్రియలో భగవంతుని స్మరణ జరుగుచూ యుండాలి. ఇది భక్తి అవుతుంది. సృష్టి రూపమైన తోడనే చూస్తారుగాని అతనిని యెవ్వరుచూడరు.

ఎప్పుడైనా అజ్ఞాతరూపంతో తనంతట తాను ఇంత ఉపయుక్తంగా తెలివితో జరిగిన సృష్టియొక్క రచన జరగటం అసంభవం. అయితే అనుమానంతో జగత్కర్త తెలియబడడు. తెలియకుండానే ప్రకృతి మారుతూ యుంటుందా? స్వయం తయారౌతుందా? అట్లా యెన్నటికి జరగదు.

తిన్నన్నం యెలా జీర్ణం అవుతుంది? దానితో తయారైన రసం శరీరానికి ఎలా పట్టుతుంది? శ్వాస యెలా నడుస్తుంది? ఈ శరీరం అద్భుత యంత్రం. తినిన అన్నంతో రక్త మాంసాదులూ, శక్తిమాత్రమేగాదు దానితో మనస్సుగూడా తయారవుతుంది. బుద్ధి తయారవుతుంది. అన్నం తనంతట బుద్ధిగా మారటం తనవశమైన పనేనా? ఆకాశాదులు యెవరయితే రచిస్తున్నారో ఆ రచనకర్తను చింతించుము. నిద్ర నిచ్చేవాడు-మేల్కొలిపేవాడు పరమాత్మ, అతనిని స్మరించు చుండుము. (సశేషం) పునః సేవలో పంపగలను. పైవిధంగా అనుసరిస్తే మనోబుద్ధులు రెండు పరమాత్మయందు హత్తుకుపోతాయని భగవానుడు "మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ" అన్నమాట కూడా చెప్పినారు. భక్త వత్సల భగవాన్‌కు జయ్.

— అవధూత.

---

సీతారామ్, గుంటూరు

నారాయణస్మరణలు.

ఒక ప్రక్రియ వ్రాయుచున్నాను. దీనిని శ్రద్ధగా మాత్రం చేసికొనిన మహోపకారం జరుగుతుంది. బ్రతికి

వుండగా భగవన్మయం జేసికోని జన్మ యేం జన్మ? నీకు వీలున్నప్పుడు - జపం-(మాలవద్దు) - శ్వాసతో ప్రారంభం కృ...ష్ణ. మళ్ళీ వదలేటప్పుడు కృ...ష్ణ. ధ్వనిలేకుండా - ఇలా శ్వాసతోటే జపం ధ్వనిలేకుండా నాలుకతో కూడా అంటూ ఉండాలి. శ్వాసతో లిపి. ఇలా చేసిన నాలుక, వాగింద్రియం ఇంకో యింద్రియంవున్నది నాలుకకు. అదీ వుపయోగించుకోవాలి. అది రసనేంద్రియం. జపంచేసేవారు జపంలో యీయింద్రియాన్ని ఉపయోగించరు, తెలియదు. నీవు దీనిని కూడా ఉపయోగించు. కృ...ష్ణ. జపం జరుగుతూ యుండగా రసనేంద్రియంతో కృ..ష్ణ నామమాధుర్యాన్ని రుచిమాస్తూ జపం జరగాలి-శ్వాస ఎంత దీర్ఘంగా నడిస్తే అలాగే ఆ రెండక్షరాలు అంటూ వుండాలి. ఇంకొక మాట-అలా జపంజరుగుతూ యుండగా జపం శ్వాసతో వేరవుతూ యుంటుంది. వెంటనే గమనించి శ్వాసతో యుక్తం చేస్తే గంభీరంగా, మధురంగా జపం జరుగుతుంది. ఇలాచేస్తే వాగింద్రియం-ప్రాణేంద్రియం అంటే క్రియా శక్తితో లీనం అవుతుంది. రసనేంద్రియం మనస్సుతో లీనం అవుతుంది. ఇక తరవాత గమనికలు వచ్చినపుడు జెప్పెదను. ...ఈమూడు మాసాలలో నాకు స్పష్టంగా ఋజువైంది. ఇక నాకు జన్మలేదు. స్వామి నాకు యిలా అనుగ్రహించారు. ఈపై విధానం వలన అపూర్వానందం కలుగును.

---

సప్రేమహరి స్మరణలు (డాకోడ 16.8.62)

శ్రీ రణఛోడరాయ మహారాజాధిరాజకి జై జై జై.
శ్రీ ద్వారకానాథకీ జై జై జై.

జరాసంఘుడు పదునేడు పర్యాయములు శ్రీ ద్వారకాధీశ ప్రభువుతో యుద్ధ మొనరించి యోడిపోయెను. అపుడు పదునెనిమిదవసారి జరాసంధుడు మధురానాథుని మీద యుద్ధమునకు వచ్చుముందు మునుపటివలె బ్రాహ్మణ ఆశీర్వాదము పొంది "ఈసారి పరాజయము పొందిన మీ శిరస్సులు ఖండించెదను" అని 18వ పర్యాయము యుద్ధమునకు బయలు దేరెను. శ్రీ బలభద్రుడు కృష్ణునితో తమ్ముడూ "ఈ పర్యాయము మనము యుద్ధమున ఓడిపోవుదు మన శ్రీకృష్ణుడు ఏమన" జరాసంధుడు బ్రాహ్మణ భక్తుడు. వానియందు బ్రాహ్మణాశీర్వాదము 17 పర్యాయములు వ్యర్థమైనది. ఈ సారి యటులైన వారిశిరస్సును ఖండించి వేయును - జరాసంధునికి మనమోడితిమా బ్రాహ్మణులకు ఒక్కొక్క గ్రామము పురస్కారముగా నిచ్చును. అనిన శ్రీకృష్ణుడు సరేయని 18 వ సారి పరారియయ్యెను. రణమున పరారికి "రణఛోడరాయ"ని పేరు సార్థకమాయెను. అట్టి రణఛోడ ప్రభువు సర్వదా రక్షించుగాక, వృద్ధబ్రాహ్మణ భక్తుని ప్రీత్యర్థము ద్వారకనుండి డాకోరు గోమతీతీర్థముతో సహా ప్రకటమయిన శ్రీరణఛోడరాయునకు పునఃపునః సాష్టాంగ నమోవాకములు. కృష్ణ! కృష్ణ! రాధే! రాధే! హరేరామ! హరేకృష్ణ!

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

---

వాసుదేవస్వరూపా! నారాయణస్మరణలు.

రొమ్ముమీద దెబ్బ యింకా బాధపెట్టుచున్నది- మానవుడు ఏదిచేసినను-చేయునపుడు మంచి బుద్ధితోనో

చెడు బుద్ధితోనో-సుఖమును లేక ఆనందమును కోరి ప్రతి పనియు చేయుచుండును. కాని తాను చేయు దానిలో దోష ముండిన-అప్పుడు దోషముగా కనుపింపదు. కావాలని కోరి చేయు పనులు ఎవరికివారు అనుభవించవలదా! ఎంతటివారికైన యిది తప్పదు. అంతయు రామానుగ్రహము.

అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

పి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, విజయవాడ.

వాసుదేవస్వరూపా.

అద్వితీయమైన ఆత్మతత్వంలో అర్థహీనమైన నామముల ద్వారా, వివిధత్వమును అంగీకరించుటయే మనస్సుయొక్క భ్రమ, అజ్ఞానము, నిజము. ఇది చాల పెద్దమోహము. ఏమన తన ఆత్మకంటే వేరుగా ఆ భ్రమకుగూడ వేరే అధిష్ఠానము లేదు. అధిష్ఠాన సత్తాలో అధ్యస్తయొక్క సత్తా లేనేలేదు. అందుచేత అంతయు ఆత్మయే

---- వాసుదేవ.

---

యం. సోమేశ్వరరావుకు హైదరాబాదు
భీమవరం

హరేరామ్ ప్రేమపూర్వక నారాయణస్మరణలు.

దుఃఖానికి కారణం దేహబుద్ధి. సుఖానికి కారణం ఆత్మబుద్ధి. ఏమివిన్నా యేమిచదివినా యింతకన్న విశేషం తోచుటలేదు. దేహబుద్ధితో యేమేమో పొందవలెనని తోస్తుంది. ఆత్మబుద్ధ్యాపొందే దేమీలేదని నిశ్చయమౌతుంది. అట్టి దృఢనిశ్చయం రామనామంతోగాక యీ

యుగంలో అన్యత్ర అసాధ్యం-సాధ్యం అనిశాస్త్రములే చెప్పుచున్నవి- శ్రీరామగోవింద!

— జై హనుమాన్

---

వాసుదేవ స్వరూపా - నారాయణ స్మరణలు.

అపరవాల్మీకి, తులసీదాసు వచనము వినండి- శ్రీరాఘవేంద్రుని వదలి అన్యవిషయములందు యెవరు విశ్వాసముంచెదరో వారికి సుఖసంపదలు లేకపోగా నరకమునగూడ తావు దూరమగును.

శ్రీరాముని విముఖుని బ్రతుకు వర్షాకాలమున పేడవలే వ్యర్థమగును. వర్షాకాలమందు పేడను యెవరు తీయరు. రెండురోజులలో పురుగులు పడును. దుర్గంధముగూడ గలుగును. అదేవిధముగ శ్రీరామ విముఖునకు చిత్తదోషమున. పాపమయ మగు వృత్తి జనించును. ప్రజలు వానిని నీచముగా చూచుచుందురు.

ఈ కలికాలమున తనదోషములు గుర్తించి శ్రీరాముని గుణములను గీర్తించిన అనాయాసముగా ఇహ పరలోకములందు మంగళము చేకూరును. నాకు యిది ఒకరకమైన వ్యాధి. దీనికి మందు నామస్మరణమె.

— అవధూతేంద్ర సరస్వతి.

---

సప్రేమహరి స్మరణలు.  ఋషీకేశము 9-9-62

శ్రీ భగవానుని కృపాకటాక్షమున శ్రీ బృందావనధామములో శ్రీకృష్ణచంద్రుని రాసలీలలు, వార్షిక ఉత్సవ

ములు, ఆ ప్రభువు రమించిన దివ్యస్థలములు, ఆ శ్యామ సుందరుని యందు అనురాగముతో బృందావనమున నివసించు ప్రేమభక్తులను, మహాత్ములను దర్శించి, సేవించి, డాకోరు సేవించితిమి. శ్రీ ద్వారకాధీశుడు బోడాణా గంగా బాయీల ప్రేమకు వశుడై ద్వారకాధామమునుండి డాకోరు స్వయంగా వచ్చి యున్నాడు. తదనంతరము కొన్నిరోజులకు అచ్చట భక్తుల దుఃఖనివృత్త్యర్థము పునః మరొక మూర్తిని ప్రసాదించెను. యాదవ వంశవృక్షము నశించిన ప్రభాసపాటణ్, అక్కడ సరస్వతీ సాగరసంగమము, సోమనాథము, ధర్మరాజు యుద్ధానంతరము పాపము నివర్తించుకొనిన ప్రాచీ సరస్వతీ, శ్రీకృష్ణస్వామికి బాణము తగిలినస్థలమును సేవించి, గణాధ్యక్షుడు, గణనాథుడు, మోదకప్రియుడు, విఘ్నవినాయకుడు, గజవదనుడు, ఉమా ప్రియ పుత్రుడు నగు శ్రీ గజవదనుని చతుర్థికి తీర్థగురువు శ్రీ పుష్కరరాజమును సేవించితిమి.

త్రికాలములలో గంగ, సరస్వతి, నర్మద ప్రవాహ సంగమములు గలది పుష్కరరాజము. మహామహిమ గలది బ్రహ్మపుష్కరరాజము. అనంతకోటి తీర్థములచే సేవితమైనది శ్రీ పుష్కరరాజము. అంతరిక్షమునుండి కార్తీకశుద్ధ ఏకాదశినుండి పౌర్ణమివరకు భూమిమీద నివసించి అనేకమంది మహాపాపులను గూడ స్వర్గగాముల జేయునది శ్రీ పుష్కరము. భగవద్భక్తులకు నిరంతరము లభ్యమైనది శ్రీ పుష్కరము. తనివితీర సేవించి శ్రీకృష్ణ ప్రాణప్రియ శ్రీవృషభానునందిని కీర్తిరాణి, ప్రియబిడ్డ శ్రీరాధారాణి

జయంతి రాధాష్టమి. భాద్రపద శు ౭ నాడు ఋషీకేశము చేరుకొంటిమి. ఒకవారంలో కేదారేశ్వర మహాదేవుని, శ్రీనరనారాయణ తపోభూమి యగు శ్రీ బ్రహ్మకపాలము మున్నగు స్థలముల సేవించ బయలుదేరెదము. భక్తులందరికి ప్రేమపూర్వక నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతి.

---

హరేరామ్–అనేక నారాయణస్మరణలు — రాజకోట 28–8–62

మధుసూదనానుగ్రహమున ఒకమాసము రోజులు శ్రీ శ్రీ శ్రీ బృందావనధామములో నుండి 24 వ తేది బయలుదేరి శ్రీడాకోరు క్షేత్రము వచ్చి శ్రీరణఛోడరాయుని తనివితీర దర్శించి ఈరోజు ద్వారకానాథుని దర్శించుటకు వెళ్లుచున్నాము. డాకోరు క్షేత్రమున రణఛోడరాయుడు (యుద్ధములో నుంచి పారిపోయినవాడు) ఆమధుసూదనునకు ఏ నామధేయము వచ్చినను ఎంత ముద్దుగనో ఉంటుంది. జీవులయొక్క జీవభ్రాంతి నివారించుటకేగదా శ్రీమధుసూదనునకు యిన్ని నామములు. ఇచట స్వామిని సేవించేవిధానము అతి ఉదారము. అన్నివేళల పాదముల చెంతకు వెళ్లనచ్చును. ప్రసాదస్వీకరణమునకు ముందు శ్రీపాదముల స్పృశించవచ్చును. జన్మాష్టమి తనుపరి ఉత్సవమూర్తి (లడ్డూగోపాలుని) ని ఊయలలో నుంచెదరు. ఆదృశ్యము ఎంత వ్రాసిన తనివితీరదు. అయినను నాకు వాక్కుజాలదు. ఇక జన్మాష్టమి (కృష్ణాష్టమి) నాడు శ్రీబృందావనములో విశేషము గూడ అత్యద్భుతము. శ్రీబాంకేబిహారజీ మందిరములో

విశేష ప్రత్యేకత. ఆయన సంవత్సరమునకు ఒకసారి ఊయలలో కూర్చుంటాడు. శ్రావణ శు 3 రోజు షుమారు లక్ష భక్తులు, యతులు, సాధువులు దర్శనార్థము వస్తారు. సంవత్సరమున కొకపర్యాయము పాదదర్శన మిస్తాడు. భక్తులు, యతులు, సాధువులు ఆయనదర్శనము చేయ ఒక రోజైనా ఉండలేరు. ఆబిహారజీ సంగీతసామ్రాట్, శ్రీ శ్రీ శ్రీ హరిదాసు మహాశయులకు లభ్యమయారు. శ్రీ మధుసూదనుని ఆశ్రయించినవారల జన్మకర్మలు నశించుటకే కదా! ఆహా! మధుసూదన భగవానునికిజై. శ్రీద్వారకానాథ భగవాన్‌కిజై.

శ్రీరామ జయరామ జయజయరామ

— అవదూతేంద్ర సరస్వతి స్వామి.

---

హరేరామ్ బృందావనం

శ్రీకృష్ణజయంతి 20-8-62, 23-8-62 వరకు

"బృందావన సో వననహీ ; నందగామ్ సో గామ్,
బంసీవటసో వటనహీ కృష్ణనామ సో నామ్॥

శ్రీవ్రజవల్లభ-రాధామోహన! మదనగోపాల్! బంసీలాల్ విహరించిన వనము బృందావనము. అటువంటి వనమే మరొకటిలేదట. శ్రీ నందబాబా సాక్షాత్ సచ్చిదానంద ఘనశ్యామ్‌ను పుత్రునిగ గన్న నందబాబా, ఒక 9 లక్షల గోవులున్న నందగ్రామం (నందగావ్) వంటి గ్రామమే లేదట. శరదృతువులో వేణునాద మొనరించిన

బంసీవటమువంటి వటము (మఱ్ఱిచెట్టు) లేదట. కృష్ణనామము వంటి నామము లేదట-ఎటువంటి దృఢనిష్ఠ! ఎంతవిశ్వాసము! అట్టి భాగ్యము సద్విచార సత్సంగ సంతుష్టిగలవారలకే కద! ప్యారే! బంసీవాలే! ప్యారే గోకులవాలే! నీ భక్తులకు ప్రియము గలిగించు సేవను ప్రసాదింపుము. నీ భక్తుల కప్రియమగు సాంగత్యమును తొలగించుము. నిరహంకారముతో నీ భక్తుల పాదధూళి నభిషేకము జేసుకొను అవసరము ప్రసాదింపుము. ఇంతకన్న నీకు ప్రియ మగునది లేనందున నీభక్తుల సాంగత్యము, సల్లాపము నభిలషించుచుంటిని. ప్యారే! మురారే, కంసారే! మధుకైటభారే! అకించనులు, అహంభావ రహితులు, అగర్వులు, అచ్యుత భావమగ్నులు నీభక్తులు. అట్టి మహానుభావుల సేవ నీసేవ కభిన్నములు. శ్రీహరి! శ్రీరమణ! శ్రీనిధి! శ్రీరామ! అనుగ్రహింపుము. అత్యుగ్రమగు కలియను మత్తేభమునకు హరివంటిది శ్రీహరినామము. మహాపాతకము లనెడు కొలనుల నింకించుటకు గ్రీష్మఋతువు గోవిందనామము. హరే! నృహరే! ధనమదాంధులకు దారిద్ర్యమును నంజన మొసగునది దామోదర నామము. హరే! రామ! హరేరామ! రాధే! రాధేశ్యామ! నీ ప్రేమ నొసగుము. నిరంతర నీప్రేమామృతము గ్రోలుబుద్ధి నొసగుము. నిరంత రచ్యుత సౌందర్యమును గ్రోలు చూపును ప్రసాదింపుము.

హేభగవన్! అభిమానము వదలి మహాత్ముల సేవ జేయలేదు. ఆస్తికబుద్ధితో తీర్థాటన మొనరించలేను. విధి పూర్వకముగా దేవతారాధన జేయలేదు. అట్టివానికి శర

ణ్యము నీవుగాక మరెవరు ! ప్రభో ! నీయొక్క విస్మృతి వలన నరకయోనులపాలు గావలసినదేనా ?

— అవధూతేంద్ర సరస్వతి.

---

హరేరామ్ (13-3-62 హృషీకేశము. 23-7-62 హరిద్వారము)

సర్వోపరితీర్థమైన శ్రీ భగవన్నామము సేవించుటచే యేకొరతయు హృదయమున కలుగలేదు.

తపము, తీర్థాటనము, యాగము, దానము, నియమము, ఉపవాసము వీటి అన్నిటికన్న మహత్వశాలియగు అధికమగు శ్రీరామ యను నామజప మొనరింపుము.

కృతయుగమున భగవంతుని సంతుష్టుని జేయుపుణ్యము ఒక సంవత్సరమున-త్రేతాయుగమున మాసమున, ద్వాపరమున పక్షమున సాధ్యమగును. కాని కలియుగమున భగవన్నామస్మరణ మాత్రమున పదిరెట్లు పుణ్యము గలుగును. భగవన్నామమున సకలధర్మములు లభించును. ఇట్టి నామమహిమ, నామతత్వము అనంతముగ వేదములు, సకల శాస్త్రములు చెప్పుచుండగ, ఓరామ ! శ్రీరామ ! నన్ను ధృఢమైన విశ్వాసముతో ఏ సాధనలను విన్నా మనసు చెదరకుండ అనన్యనిష్ఠతో, ఏ యిబ్బందులు వచ్చినను, ఏ రోగములు వచ్చినను, ఎవరు నిందించినను, ఎవరు భూషించినను మనస్సును సమవస్థగ నుంచుకొనుచు, ఈర్ష్యా రాగ ద్వేష రహితముగ జపించు, కీర్తించు భాగ్యము ఈ జన్మకులేకున్న, యే జన్మకైనా ప్రసాదించుమా ! ఈర్ష్యాసూయాదులు,

రాగద్వేషములు, తాపత్రయములు నీ నామమునందున్న మాధుర్యమును గ్రోలనీయక నన్ను భ్రష్టునిజేయు చున్నవి గదా! రామ! శ్రీరామ! సర్వ ప్రపంచము భక్తులుగా నైనా చూడలేని దుఃస్థితిలో నున్న నాకు నీవే ప్రపంచమను భావము ఎప్పుడు గలుగునోగదా! నీవు సర్వత్రయున్నావని మరచుటచేగదా। హెచ్చుతగ్గులు, ప్రియాప్రియములు నీచ ఉచ్చములు మనసున గలుగుట

నిజముగా పరేచ్ఛాప్రారబ్ధము కొంత నీ సాన్నిధ్యమునకు దూరముగా జేయుచున్నదని తోచుచున్నది. కాని యెట్టిదుఃస్థితిలోను నీ నామమే, నీ పతితపావన నామమే ముమ్మాటికిని శరణ్యము! శరణ్యము!! శరణ్యము!!! నేను మానసిక దౌర్బల్యముచే యేమేమి కోరితినో అవి యన్నియు నాతప్పులె. దానికి శిక్షాపాత్రుడనె. పరిపూర్ణతను పొంది-అపూర్ణు డనుకొనుటయే పెద్దతప్పు. శిక్షింపుము. ముమ్మాటికిని శిక్షింపుము. నిరంతరము నీనామమే శరణ్యమను నిష్ట జనించువరకు శిక్షింపుము. నీవు శిక్షించుటయే నాకు రక్షణ. శ్రీరామ జయరామ! జగదభిరామ! రఘురామ! శ్రీరామ! శ్రీరామ! శ్రీరామ!

---

హరేరామ! కాశి 6-3-62

మీ అనుష్ఠానము సక్రమంగా గురువులు ఆశీర్వాదించిన విధమున జరుగుతూ ఉండవచ్చునుగదా అని తలంపు. నిజముగ ఎవరుచెప్పినా-విన్నా, చదివినా, గుర్తించవలసిన వస్తువు ఏకమేగదా! అది సిద్ధించనంతవరకు ఎన్ని జన్మలైనా

యాత్రలు మొదలగునవి జరుగుచునే యుండును. అంతట నిశ్చయాత్మక బుద్ధి కలుగును. అదియు గురువులు త్వరలోనే అందిచ్చినారు. నీవు యేమరక దృఢముగా అందుకొనుము. స్వార్థముతో గాక పరమార్థముతో జేసిన సేవ సమాధివరకు గొనిపోవును.

నీయందు శ్రద్ధగలిగి నీ చెప్పుచేతలలో నుండు బుద్ధిమంతులగు నీ పిల్లలందరకు నారాయణ స్మరణలు.

— హరేరామ్.



హరేరామ్ నారాయణ స్మరణలు ! బృందావనము 28-8-62

శ్రీకృష్ణ జయంతి !

మధురానాథా! నీ జన్మకర్మలు దివ్యములు గదా! అనంతములు గదా! నీవు నీలమేఘశ్యాముడవా ! కేకీకంఠాభనీలుడవా ! నవజలధర శ్యాముడవా ! మన్మథ మన్మథుడవా ! భవజలనిధి మథన మందరుడవా ! ఆహాహా! మదనాభిరామ ! పరిపూర్ణకామ ! శ్యామ ! జయము ! జయము ! జయము ! బిహారీ! బ్యాంకేబిహారీ ! అటలబిహారీ ! విలీన బిహారీ ! కన్హయ్య ! కృష్ణకన్హయ్యా ! కువరకన్హయ్యా ! జయహో ! జయహో!

అధమవుధారన ! హరే ! హరే ! జయజయహరే! హరే ! నీ ప్రేమను ప్రసాదింపుము. నీ కృపాదృష్టిని ప్రసాదింపుము. దీనబాంధవా ! జగదేకశరణ్యా ! పాహి, పాహి, పరమ ఉదార ! మహానుభావా ! మహాత్మా ! శరణు

శరణు. గోవింద గోవింద హరే. ముకుంద ముకుంద ముకుంద విష్ణో! మురారే! కంసారే! ధేనువారే! హరేహరేహరే...

— హరేరామ్.

---

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
తెనాలి

తిరువన్నామలై 29-7-74

వాసుదేవస్వరూపులకు సకుటుంబంగా నారాయణస్మరణలు.

మహాత్మా! శ్రీరమణాశ్రయీగారికి జ్వరము వచ్చుచునే యున్నది. లక్ష్యార్థంలో వారు మహాగురుకృపతో, సంపూర్ణఆరోగ్యంలో తన్మయతతో యెప్పుడూ వుంటూన్న సంగతి మీకు విదితమేగదా!

గోవింద! అటులనే అందరియొక్క స్థితియు. పాము అని ఎంతగా గందరగోళమున మునిగిన తాడుతాడే, అట్లుగానే సమస్తనామరూపములు - మంచిగానూ, చెడ్డగానూ తోచేవి ఒకే ఒక ఆత్మయే. అదియే భక్తులకు తన యిష్టదైవము.

నారాయణ! శ్రీశ్రీశ్రీ పుష్పగిరిపీఠాధిపతులకు మా జయజయకారములతో ఓంనమోనారాయణ చెప్పగోరెదను. వారు చలాచలస్వరూపులు. అందుచేత అహమ్స్వరూపులే. ఇదం భవాన్ ఇవియన్నియు అహమే. మహాదేవదయానిధే వాసుదేవజగన్మయ —

శ్రీరామరక్ష.

బ. సూ. శాస్త్రి యూ సీ
శ్రీరామరక్ష-సర్వజగద్రక్ష. 2-10-74

త్వయ్యర్పిత మనసా త్వాం పశ్యన్ సర్వం త్వయా కృతితయా ।
సతతం భజతేఽనన్యప్రీత్యా సజయత్యరుణాచల త్వయి సుఖే మగ్నః॥

వాసుదేవస్వరూపా। నారాయణస్మరణలు.

...శ్రీబ్రహ్మచారిగారు చిదానందులు గదా! అనగా వాసుదేవస్వరూపులే. మీానమస్కారము లందించెదను. నాయొక్క శరీరం విఘ్నములు లిగించక భగవత్పరమాటకు సహాయపడుచు నన్ననుసరించుచున్నది. ఎట్టి స్థితిలోను నేనే అధిష్ఠానంగదా! దానికి అనగా దృశ్యానికంతా నన్నమాట.

మీాయింటివిషయం వ్రాశారు. కర్మకక్షలో ప్రారబ్ధ మంటారుగాని అది సరిగాదు. భక్తికక్షలో భగవద్విలాసమే. ఈనాశరీరమనే గృహంలోకూడా యింతేసుమా. లోపల బయట అధిష్ఠానంకన్న అన్యం లేదనిగదా శ్రుతిప్రమాణము. గాన విపత్తులు విలాసమేగదా। వాసుదేవ। అధిష్ఠానబలం అధికంగా అందుకున్నకొలదీ దృశ్యానికి అంతంవుందనియు, అథవా దృక్కన్న దృశ్యానికి అస్తిత్వమే లేదనియూ తోచు చుండును.

ఇప్పుడే బ్రహ్మచారిగారు నేనున్నగదికి వచ్చారు. మీానమస్కారములందించితిని. గుంటూరు స్వర్ణోత్సవాలకు వెళ్లుటకంగీకరించారు. భక్తులందరికి నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

శ్రీ ఆదిశేషదాసుగారికి ఓం నమో నారాయణ రాజమండ్రి
గుంటూరు 8-3-74

వాసుదేవ! సందేహములేదు. భగవంతుని ముందు వుంచికొని నడచేవారి సకలకార్యములు నిర్విఘ్నంగా సంపన్నమవును. నేను ముందువుండాలనే అహంకార పూరితులకు అన్నీ జరిగినా అమంగళకరంగానే వుంటాయి.

గోవిందా! గీతలో భగవానులు తనవారగుటకు "మదర్థమపి కర్మాణి" అంటూ అడుగడుగునా చెప్పియున్నారు.

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

---

వాసుదేవ! సకుటుంబ నారాయణస్మరణలు.

వినండి-ప్రారబ్ధానుసారము ప్రాప్తించిన వాటితో సంతోషమును, సుఖమును, ఎవడు గలిగి యుండునో, అట్టి వానికే శ్రీరఘునాథుని పాదపద్మములందు ప్రీతి జనించును. ఇది సత్యము. ఏదనముత్తోకుక్కనట్లు ఎవని మనస్సు చాంచల్యముగా ఎగురుతూ ఉండునో అట్టివాడు భజనయందు కూర్చున్నపుడు గూడ మనసు చలించుచుండునో అట్టివాడు వనములోనున్నను, ఇంటిలోనున్నను ఒక్కటే. వానియొక్క బహిరంగ త్యాగమునకు మహాత్మ్యమేమియు లేదు. విషయ రసమునందు ఉదాసీనుడై రాముని ప్రేమించవలెను. నిజమైన సాధనభక్తి ఇదియే-ఏదో వ్రాయుచుందును. నాకు నామపిచ్చి. మీకు తెలుసునుగదా!

— హరేరామ.

హరేరామ్ ! భీమవరం 16-8-61

సాధకుడు భోజనము మితముగా భుజించవలెను. రుచుల కొఱకు లోభియై అధికముగా భుజించుట భోగియొక్క లక్షణము. కేవలము శరీరము స్వస్థతగ నుండుటకొరకే భుజించవలయును. భగవదారాధనకొఱకు సాధకుని వస్త్రములుగూడ సామాన్యముగ నుండవలెను. ఆడంబరముగా నుండరాదు.

సాధకుడు మితముగా మాట్లాడవలయును. మితముగా పరుండవలెను. ప్రాపంచిక విషయములనుండి అలిప్తుడుగ నుండుటకు ప్రయత్నించవలెను.

త్యాగవైరాగ్యములు లేనిచో భగవత్ప్రాప్తి కలుగదు. ఒక భక్తుడు 72 సంవత్సరములు సాధనజేసినను తన దగ్గరనున్న రెండు వస్తువులను విడచువరకును భగవత్ప్రాప్తి కలుగలేదు.

సాధకుని పరమధర్మము పరుండునపుడు, మెలకువతో నుండునపుడు, నిద్రనుండి లేచునపుడు, కూర్చున్నపుడు, లేచునపుడు - భగవత్స్మరణముతోనే కాలము గడుపుచుండవలయును.

ఎవడు అన్నము, నీళ్లు దొరకనపుడు అత్యంత ప్రఫుల్ల మనస్కుడై యుండునో, మృత్యుపర్యంతము భగవద్భజన చేయునో, దుఃఖములను ప్రభు కృపగా జూచునో, మృత్యు సమయమున నవ్వుతూ ఉండునో అతడే నిజమైన భక్తుడు.

సాధకు డెంతెంత శ్రద్ధగలవాడగునో అంతంతగా విపత్తులు సంపత్తులుగా మారును. శత్రువులు మిత్రులగుదురు. జగత్తంతయు నిష్టదేవుని స్వరూపముగ నుండును.

— హరేరామ.

---

హరేరామ్. భీమవరం 24-9-61

సత్సంగ మెంతయుండునో దానికి రెట్టింపు మననము ఉండవలయును. కొంచెము తిని ఎక్కువ నమలిన రసము పుట్టును. పునాదిలేకుండ గృహము నిలువదు. మననము లేకుండ సత్సంగము ప్రయోజనము కాదు నామజప సమయమున స్థానము, రూపము, లీల సేవలను చింతించిన నిజమైన భగవద్భక్తి కలుగును. ఇది (రూపలీలాచింతన) లేకుండ చేయునామజపము వృత్తిని మాత్రము తగ్గించును. రసావిర్భావము గాదు. డోలక్ మోయువాని చందముగా నుండును. మూసలోపడదు. భగవంతునియందు తాదాత్మ్యము ఎప్పుడు కలుగునో అపుడు చిత్తవృత్తి మూసలో పడును (ఇష్టదేవతా స్వరూపము కలుగును). నామజప సమయమున కలుగు ఆనందము, సంసారచింత, దుఃఖమును మాత్రమే పోగొట్టును (ఇందువలన వ్యాకులత యేర్పడును) మూసలోపడిన వెంటనే ఇష్టదేవతా స్వరూపము భాసించును. మరియు లీలారసము అనుభవమునకు వచ్చును. ఈ విధముగా నామజపమునకు చరిత్ర, సత్సంగము లేనినాడు మధ్యమధ్య లీలాత్మక పదములు గానముచేసిన లీలాభావము కలుగును. నామజపమువలన విక్షేపనివృత్తి, పదగానము

వలన లీలావిర్భావము గలుగును. కాని విక్షేపములు కలిగిన నామజపము చేయుము. జపమువలన మనస్సుకు ఏకాగ్రత యేర్పడును. లీలలను చింతింపుము.

— అవధూత.



బు. సూ. శాస్త్రి పొన్నూరు వెళ్లుచూ, తెనాలి స్టేషనులో 26-11-61

హ రే రా మ్

ఎపుడు మానవుడు సమస్తకర్మలను పరిత్యజించి నన్ను సర్వాత్మనా శరణు పొందునో, అట్టి సమయమున అతడు నాకు విశేషమాననీయు డగును. మరియు నేను అతనిని జీవత్వ మునుండి విడిపించి, అమృత స్వరూపమైన మోక్షప్రాప్తిని కలిగించెదను. అతడు నా యందు లీనమై నాస్వరూపమగును.

నా యొక్క పరమపావన లీలలు, కథా శ్రవణము కీర్తనద్వారా క్రమక్రమముగ చిత్తమాలిన్యము క్షాళనమగు చుండును. అప్పుడు క్రమక్రమముగ వానికి సూక్ష్మ వస్తువు యొక్క యథార్థ తత్వదర్శనము అగుచుండును. అంజనము ద్వారా ఎట్లు నేత్రరోగము నశించి సూక్ష్మ వస్తుదర్శన మగుచుండునో......

నా భక్తిని పొందగోరువారు నా అమృతమయమైన కథలయందు శ్రద్ధ యుంచవలెను. నిరంతరము నా గుణము లను లీలలను నామ సంకీర్తనమును చేయవలెను. అత్యంత నిష్ఠతో నన్ను పూజించవలెను. స్తోత్రముతో నన్ను స్తుతించ వలెను. (భగవాన్ - భాగవతము)

ఈశ్వర విముఖునకు భగవన్మాయచే తన స్వరూప నిస్మృతి కలుగును. దేహాది ,అన్యవస్తువులందు తన్మయతచే, వార్ధక్యము, రోగము మొదలగు అనేక భయములు కలుగును. అందుచేత తన గురువునే ఆరాధ్యదేవునిగ, పరమప్రియునిగ యెంచి అనన్యభక్తిద్వారా ఈశ్వర భజనము చేయవలయును.

దేహాభిమానముగల జీవుడు సంసార చక్రమున అనాది కాలమునుంచి భ్రమించుచున్నాడు. భగవంతుని లీలలు, గుణములు మరియు నామకీర్తనకన్న మించిన పరమలాభ మింకొకటి లేదు. వీనివలన సంసార భ్రమణ నశించును. పరమ శాంత్యనుభవము గలుగును. జై జై సీతారామ్. శ్రీరామ. శివరామ. హర. హరహర మహాదేవ.

— హరేరామ్.

---

వాసుదేవ స్వరూపా ! నారాయణస్మరణలు

ప్రస్తుతము చికిత్సావసరములు తప్పవుగదా! శరీ రారోగ్యం కొంచె మభివృద్ధిలోనే గలదు. రాత్రులందు నిదురమాత్రం ఇంకా పట్టటము లేదు. కొంచెం ఆయాసం వస్తూ వుంటుంది.

అయ్యా! ఇది యంతయు సర్పభ్రాంతే. భ్రాంతి యను వ్యాధేకదా పోవలసినది. నేనుయందు దేహము కల్పి తమే గదా! సర్పమువలె రామానుగ్రహమున వట్టి ఆరో గ్యమేగదా కావలసినది. వాసుదేవ! మీకు పునః సపరి వారముగా నారాయణస్మరణలు

— వాసుదేవ.

హరేరామ్ భీమవరం

సాధకుడు గురువును నమ్మిన సాధనకు ఏవిక్షేపములు ఉండవు. ఈభావము (దినచర్య)నుగూడ గురువునందే యుంచండి. అంతయు ఆయనయే చూచుకొనును - గురువు గారు వస్తారే.-ఈయనయే గురువు (కామకోటి పీఠాధి పతులు) అంతయు గురుమయమే. గురువు వేరేలేరు. నీభావ మంతయు గురువునందే యుంచుము.

— అవధూత.



నారాయణ స్మరణలు

వాసుదేవ! నామసాధననుగురించి మహాత్ములు చెప్పిన మాటలు-ఈర్ష్యాసూయాద్వేషాదులు, రాగ ద్వేషములు, తాపత్రయములు, నీనామమునందున్న మాధుర్యమును గ్రోలనీయక నన్ను భ్రష్టుని జేయుచున్నవి గదా! రామ! శ్రీరామ! సర్వప్రపంచమును భక్తులుగా నైనా చూడలేని దుఃస్థితిలో నున్న నీవే ప్రపంచమను భావము ఎప్పుడు గలుగునోగదా! నీవు సర్వత్ర ఉన్నావని మరచుటచేగదా హెచ్చుతగ్గులు, ప్రియాప్రియములు, నీచఉచ్చములు మనసున గలుగుట-ఈ విధముగా నిరంతరము మననము జేయుచుండిన కొంతకాలమునకైనా నానునిష్ఠ కలుగకుండునా? వాసుదేవా!

— అవధూతస్వామి.

శ్రీ పురుషోత్తమ శర్మగారికి
అనంతవరం

కేదారఖండం
30-8-70

హరినామ సంకీర్తన భక్తులందరికి, సప్రేమ, సాదరంతో వ్రాయునది. భగవదనుగ్రహంతో నేపాల్ పశుపతిని సేవించి ఉత్తరకాశి, గంగోత్రి దర్శించి, కేదారం వెళ్లు చున్నాము. ఎల్లుండి కేదారనుంచి తిరిగి ఋషీకేశం చేరగలము. మార్గం అనుకూలంగాఉంటే బదరి వెళ్లగలము. శ్రీ రంగయ్యగారి నిత్యానుష్ఠానము నిర్విఘ్నంగా జేసుకొను చున్నారుగదా! హరినామ సంకీర్తనం ఏకాదశులకు జరుపుకుంటున్నారుగదా! అందరికి నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

అత్మీయులు సోమ సుబ్రహ్మణ్యులు
భీమవరం

బృందావనం
11-11-67

ప్రేమపూర్వక ఓంనారాయణ

బ్రహ్మమాత్ర మిదం విశ్వమ్. సత్యం సత్యం
నామ సంకీర్తనా దేవ తారకం బ్రహ్మదృశ్యతే।
సదే వేదం సర్వం సర్వం చిదేవైకరసం॥

సంవత్సర పంచాక్షరి దీక్ష శివరాత్రితో పూర్తిగాగలదని రమణాశ్రమ ఉత్తరం వ్రాశారు. ఇచట శ్రీబ్రహ్మచారిగారు 40 దినములు పాలతో మౌనంగా యుంటున్నారు. అది నాకు మౌనంలేకుండా సంక్రమించింది......ఆత్మానుసంధానమునకు మిక్కిలి దోహదంగానే యున్నది.

— హరేరాం

జయతు జగన్మంగళం హరేరామ, రాజమండ్రి 14-2-74
వాసుదేవస్వరూపా ! శ్యామ్. నారాయణస్మరణలు !

భాగవతం వచ్చింది. పఠనం ప్రారంభించినావు. అని వ్రాశావు. చాల సంతోషం. మీ గృహంలో భాగవతులు గూడ వచ్చి యున్నారు. సద్ధర్మవ్రతులు, స్వధర్మ నిష్ఠులు, శ్రీ రామచంద్ర భగవానుని అనన్యభక్తులు. శ్రీ రామాయణ శ్రీ మద్భాగవత పారాయణరతులు వారలకు జయజయా కారములు.

వాసుదేవ ! భగవ ద్విభూతులను విశేషించి అత్యంత ఆదరముతో సేవించాలి. చీమ-బ్రహ్మ, బ్రహ్మ-బ్రహ్మగాని అలా చూడటం సాధ్యంకాదు. ముందు విభూతులను భగవ దాదేశాను సారంగా సేవించాలి. అట్టి విభూతులలో ప్రథమం తల్లి, తండ్రి, గురువు, దైవం యీ విధంగా యెన్నో ఉన్నాయి. అట్టి విభూతులను మనం అన్నిటిని భగవానునిగా చూడలేక పోతున్నాము. ఇక సర్వాన్ని బ్రహ్మగా యెలా చూడకలుగుతాము ?

అందుకనే సగుణోపాసన సవ్యంగా జరిగితే తత్వమే హస్తగతం అవుతుంది. అయితే యీ కాలంలో సగుణోపాసన గూడా సరసంగా చేయలేరు. గాన సర్వేశ్వరుని నామరూప ధామ లీలాకీర్తనాదులను ప్రశస్తంగా చెప్పినారు. "ఏష మే సర్వధర్మాణాం, ధర్మోధిక తమో మతః। యద్భక్త్యా పుండరీ కాక్షం స్తవై రర్చే న్నర స్సదా" ఈ సాధన అధికతమ ధర్మమని కంఠోక్తిగా భీష్ములవారు చెప్పినారు

నిర్ధనుడు నామంచేత పాపాన్ని పోగొట్టుకున్నట్లు, పాక యాజిపాపాన్ని నిర్మూలనం చేసికొనలేడు. ఇక భౌతిక సంపదలతో వారి మాట అసలేమ్మొగ్యం.

“రామనామ్నైవ ముక్తి స్స్యాత్, కలౌ నాన్యేన కేనచిత్” అన్నారు. శ్రీమద్భాగతం అద్వైత గ్రంథములకు శిరోమణి. “శ్రీమద్భాగవత వార్తాసురాణా మపి దుర్లభమ్”.

న తపోభి ర్న వేదైశ్చన జ్ఞానే నాపి కర్మణా।
హరి ర్హి సాధ్యతే భక్త్యా, ప్రమాణం తత్ర గోపికాః ॥
ఇదం భాగవతం నామ, పురాణం బ్రహ్మసమ్మితమ్।
భక్తిజ్ఞాన విరాగాణాం, స్థాపనాయ ప్రకాశితమ్॥
సదా సేవ్యా సదా సేవ్యా, శ్రీమద్భాగవతీ కథా।
యస్యాః శ్రవణమాత్రేణ, హరి శ్చిత్తం సమాశ్రయేత్॥
ఏకం భాగవతం శాస్త్రం, ముక్తిదానేన గర్జతి ॥

వాసుదేవ! శ్యామ్. భూలోకంలో యీ భాగవతం సాక్షాత్ బ్రహ్మస్వరూప విగ్రహం. దీనిని విన్నవారికి, వినిపించినవారికి ఇరువురకు గూడ భగవాన్ శ్రీకృష్ణునియొక్క సమత్వం ప్రాప్తిస్తుంది. ఇంకే యితర ధర్మములతో పనియేల? “శ్రీమద్భాగవతాఖ్యోఽయం ప్రత్యక్షః కృష్ణ ఏవ హి” భగవంతుడు-భక్తి-భాగవతం-భగవన్నామం - వాసు దేవ! భక్తుడు అభిన్నమే. ఇక నీ జీవితంలో భాగవత పారాయణ అఖండంగా సాగుటకు ఆ నందనందనుడు నిన్ను పరిపూర్ణముగా అనుగ్రహించుగాక!

వాసుదేవ, భగవద్గీత శ్రవణం జరుగుతోందిగదా! అందులో అవికంప యోగం చెప్పినాడు భగవానుడు. అది సహజంగా భాగవతం అం స్తుంది. వాసుదేవ! ఈ భాగవతంలో శుద్ధాంతఃకరణులైన సత్పురుషులు తెలిసికొను నటువంటి యోగ్యమగు కల్యాణకరమైన, వాస్తవిమైన వస్తువును వర్ణించినారు. వినువారలయొక్క హృదయంలో అవిలంబంగా అవిరుద్ధుడౌతాడు భగవంతుడు.

వాసుదేవ! నా శరీరారోగ్యం క్రమారోగ్యం గలుగుచున్నది. రాత్రులందు మాత్రం ఇంకా బాధలు ఇంకా నిద్ర పట్టనివ్వటంలేదు. జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనం అన్నారు. అనుదర్శనం ఇదే యోగం. వీటన్నిటికి అధిష్ఠానం-అపరిచ్ఛిన్నమైన "నేను". ఆ నేను యందు యిది అంతా రజ్జువునందు సర్పభ్రాంతివలెనే గదా! గోవిందా! ఈ దినం ప్రభుదత్తజీవారు ప్రయాగనుంచి బృందావనం వెళ్లుచూ జాబు వ్రాసినారు, రెండు మాసములుండి ప్రయాగరావలెనని. భగవదిచ్ఛ! హరేరామ్.

పిభబత భాగవతం రసమాలయం, ముహురహో రసికా భువి భావుకాః।
తవకథా మృతం ర ప్తజీవనం, కవిభి రీడితం కల్మషాపహమ్ ।
శ్రవణమంగళం శ్రమదాదతం, భువి గృణంతి తే భూరిదా జనాః॥

— అవధూతేంద్రసరస్వతీస్వామి.



రామరక్ష - పున్నారావుగారు
గూడూరు

ప్రయాగ
22-10-74

వాసుదేవస్వరూపా! నారాయణ స్మరణలు.

భజనకు బలం రావాలంటే వ్యాప్యకంగా యున్న స్వరూపం గూడ మనస్సు అందుకోవాలిగదా! దానికే ప్రయత్నం చేయవలెగదా! అదే అత్యవసరమునూ. నామార్థ చింతనం వలన - రూపార్థ - చింతనంవలన భగవంతుడు అనుగ్రహించి తన వాస్తవరూపాన్ని అందివ్వకుండునా? ఆధైర్యంతోనే నామం చేయుచున్నాను. అదే రామరక్ష యని దృఢముగా విశ్వసించుచున్నాను.

— అవధూతేంద్రస్వామి.

---

బి. యస్. ప్రకాశరావుకు
భీమవరం

నిడుప్రోలు
11-11-67

సకలప్రాణులకు ఆది మాతయు, పరమానంద స్వరూపిణి జగదంబయే యను తత్త్వార్థము నెరిగినవారే భక్తులు. భూలోకవాసులు అగణ్యంబులగు పాపంబులొనర్చినను త్రినేత్రిని స్మరించు వారగుచో ఆమె కరుణకు పాత్రులై, పాపరహితులై ధన్యాత్ములగుదురు. భవసాగర తరణమునకై తన పాదపద్మములను పడవగ నొసంగిన మహాదుర్గకు జయము. మాతరంబ శివేశివే.

— హరహర మహాదేవ.

శ్రీరామరక్ష - ప్రసన్నరావుగారికి
గూడూరు

హైదరాబాదు
3—6—75

వాసుదేవ ! సప్రేమ నారాయణస్మరణలు. ప్రస్తుతం యిచటనే యున్నాను. అస్వస్థతగానే-ఆనందంతోనే సమయం గడచుచున్నది. ఏమన, గమ్యస్థానం గురుర్వానుగ్రహమున స్వస్వరూపమేగనుక, అది నిరతిశయ సుఖస్వరూపం. "స్వస్వరూపా దన్యం నకించన" వాసుదేవ ! హనుమదాచార్యుల మహాప్రసాద ఫలమే యీ ఆనందమునకు కారణము.

...... వాసుదేవ ! సగుణోపాసనయే కేవలము నిర్గుణోపాసనకు చరమోపాయము. విశేషించి ఈ కలిలో నామము ముఖ్యోపాయము. సగుణపరిచయం పూర్తిగా కలుగకుండా యీదినములలో వేదాంతులకు రాగద్వేష ములు పోవడం లేదు ద్వైతభ్రమ వారలకు అధికంగా గోచరించుచున్నది. సగుణపరిచయం పూర్తిగా గానిచో వేదాంతం విషంగా పరిణమిస్తుంది.

"సగుణజ్ఞాన హీనస్య, నహి నిర్గుణవేదనమ్ ।
సంధిదర్శన హీనస్య, యథా న శృవదర్శనమ్॥
— అవధూతేంద్ర.

---

బి. యస్, ప్రకాశరావుకు, భీమవరం. 25-3-63

సర్వస్వరూపే సర్వేశి, సర్వశక్తి సమన్వితే ।
భయేభ్య స్త్రాహినో దేవి, దుర్గాదేవి, నమోఽస్తుతే ॥

జీవులందరు జగదంబ భజనచేసి ఆ తల్లి పాదారవిందా లను చేరుకోవాలి. అందు కనువుగా పరమేశ్వరి మనకు ఈ

దేహాన్ని, ఈ మనసును ప్రసాదించింది. ఆమె అనుగ్రహాన్ని సంపాదించటానికి ఇవే సాధనాలు. రాత్రింబవళ్లు ఏ స్థితిలో నైనా ఆ తల్లిని మరువక నోరార అమ్మనామాన్ని స్మరిస్తూ మనసార జగదంబను ధ్యానించాలి. ఈ జన్మ తరింపజేసి కోవాలి. ఈ లోకసంబంధమైన సుఖాలకోసం వాటివ్యామోహాలలోపడి శ్రీమాత నామస్మరణ మరచిపోకూడదు. దుర్గ నామం విలువలేని రత్నం, పనికిమాలిన గాజుపెంకువంటి ఇహ సుఖాలకోసం ఈ అమూల్యరత్నాన్ని వదలుకొన వచ్చునా? అమ్మనామంముందు సర్వసుఖాలు తుచ్ఛమైనవే.

— హరేరామ్.

---

శ్రీరామరక్ష-పున్నారావుగారికి గూడూరు — రాజమండ్రి 17-2-74

జయతు జగన్మంగళం హరేర్నామ.

శ్రీరామరక్షే - శ్రీరామరక్షతో - శ్రీరామరక్షలో శ్రీరామరక్షను పొందుచున్నది.

శ్రీరామరక్షాస్వరూపు లగు పున్నారావుగారికి నారాయణస్మరణలతో వ్రాయునది.

వాసుదేవ! భగవంతుడు ఎవరిని తనవాడుగా తలంచునో వానికి బుద్ధియోగము నొసంగును. అప్పుడు యీ కష్టములు, ఈఅవమానములు మొదలగు వాటిని కలిగించి భగవంతుడు నన్ను పరిశుద్ధునిగా చేయుచున్నాడు. తనవైపు ఆకర్షించుచున్నాడు అని తెలిసికొనును. ఎవరికి బుద్ధియోగము లభింపదో అతడు దుఃఖములో అత్యంతదుఃఖమును

అనుభవించును. భగవంతునకు దోషములు ఆపాదింప జేయును.

అట్లుగాక-తన కభిన్నమైన శ్రీరామరక్షను సర్వులకు అందింప జేయుటకు సర్వజగద్రక్ష యగు శ్రీరామరక్షను మీకొసంగెను. అదియే బుద్ధియోగము మీకొసంగినది.

ఎప్పుడు ఈశ్వరునికి గొప్ప అనుగ్రహము కలుగునో అప్పుడు మనుష్యునకు ఈశ్వరుని వైపు నడచుటకు ఇచ్ఛ కలుగును.

వాసుదేవ! "శ్రీరామరక్ష - సర్వజగద్రక్ష" అనాది సిద్ధమైనది. ఆ లయంవరకు, అనగా శరీరపతనమయ్యేవరకు మానవునకు ఆశ్రయింప దగినది శ్రీరామరక్ష ఒక్కటియే. త్రేతాయుగములో శ్రీరాముడే రక్ష. కలిలో శ్రీరామ నామమే రక్ష. రాముడు, రామనామము ఒక్కటే. అంతే కాదు. రామరక్షాప్రభావంచేత జీవేశ్వర జగత్తులు సాక్షాత్ రాముడే యని గూడా తెలియగలదు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

శ్రీ అచ్యుతుని వెంకటసుబ్బారావుగారు చీరాల　　　　బృందావనం 29-10-67

సకుటుంబముగా నారాయణస్మరణలు.

జయతు జగన్మంగళ హరేర్నామ.

శ్రీహరినామము ధర్మార్థకామమోక్షదాయకము. చిన్మయచింతామణి. కైవల్య మొసగు కామధేనువు.

"యన్నామ తత్వం నహి వేదవేదోఽప్యన స్తశాఖః సకల స్వరూపం."

నామతత్వము "వేదోనవేద" అనుటచే త దవతార మని సూచితము (భ. మ. సంగ్రహః) అనంతమహిమగల శ్రీభగవన్నామము సర్వోపరితీర్థము, సర్వోపరియజ్ఞము, సర్వోపరిదానము.

నామ లేత భవసింధు సుఖాహిఁ ।
కరహుఁ విచారు సుజన మన మాహీఁ॥ (తులసీదాసు)

నామోచ్చారణమాత్రమున భవసాగరము యెండి పోవును. ఈవిషయము విచారసంపన్నులగు సుజనులకే తెలియును.

కలియుగమున తప మశక్యమగుటచే, అర్థదోషమున దానము నిర్వీర్య మగుటచే, కర్మ లవిద్యాపూరిత మగుటచే లేక కల్మషచిత్తులు, విధిక్రియా విహీనులు, పాపద్రవ్యోప జీవితు లగుటచే శ్రీవ్యాసమహర్షి "నా స్త్యే వ నా స్త్యే వ నా స్త్యే వ గతి రన్యథా"అని శ్రీహరినామమును సూచించెను.

రామనామము మహావాక్యము, మహామంత్రము. గనుకనే సదాశివుడు సదా జపించుచు ముక్త్యర్థము సర్వ ప్రాణులకు వారణాసిలో ఉపదేశ మొనరించు చుండును. రామనామము మహామంత్రమైనను దేశనియమము, కాల నియమము, వర్ణనియమము, జాతినియమము లేక కీర్తించుటకు సులభముగాను, సుఖముగాను సర్వులకు సన్నిహితముగా

నున్నది. ఎవరు రామనామమును పఠించెదరో, ధ్యానించెదరో, కీర్తించెదరో వారిని స్పృశించినా, లేక జూచినా అట్టివారు పాపములనుండి విముక్తు లగుదురు.

(మహాభారతము)

రామనామాశ్రయులకు కలిభయము, కాలభయము, మృత్యుభయము-మరియు శతృకృతభయము ఉండదు,

కృష్ణకృష్ణ మధుసూదన విష్ణో కైటభాంతక ముకుందమురారే
పద్మనాభ నరసింహహరే శ్రీ-రామరామ రఘునందనపాహి.

— అవధూత.

---

హరేరామ్ ! జగన్నాథము 24-8-63

ఈ ఉదయం కటక్‌నుండి వచ్చితిమి. స్వామిదర్శనము, ప్రసాదము, అనంతరము సత్సంగము. పిదప రాత్రి గం॥ 10 ల బండిలో రేపు ఉదయం చేరుకుందుము. రెండుమూడు రోజులు అమ్మతో ముచ్చటలు విందామని యున్నది. లక్ష్మీరూపముతోనూ, నిద్రా రూపముతోనూ, తృష్ణా రూపముతోనూ, శాంతి రూపముతోనూ, కాంతి రూపముతోనూ, క్షుధా రూపముతోనూ, మాతృ రూపముతోనూ సర్వత్ర ఉన్నది అమ్మయేగాని అన్యములేదని వినగా, విచారించగా ఋజువు అవుతుంది. జయమాతా! పూతానుకంపానమేతా। దుర్గే! అపవర్గదాయిని!

ప్యారే! గోపాల్! కండ్లు కాళ్ళు చేతులు సమస్తము యిచ్చిన దెందులకు? నీకు దూరమగుటకా? అంతేనా?

కాదు కాదు. అట్టివానితో నిన్ను పొందకపోవుట దురదృష్టము. సర్వప్రయత్న మొనరించి నీపరంగా జేసికొనుటకే! జన్మయొక్క ఫలమదే. సత్యము! సత్యము!! భక్తు లందరకు ప్రేమపూర్వక నారాయణ స్మరణలు.

— అవధూత.

---

శ్రీయుత M, జీయన్నకు బృందావనం

రామగుండం 25-11-67

జయతు జగన్మంగళం హరేర్నామ

సకుటుంబముగా నారాయణస్మరణలు. 663 పర్యాయములతో భగన్నామమును వ్రాసిన ఉత్తరము చదువుకొని, కళ్లకద్దుకొని, శిరస్సునందుంచుకొంటిని శ్రీరామ ప్రభువే శ్రీరామనామమే. నీకు - నాకు యీవుత్తరమునకు రామగుండంలో జీవులకు, రాళ్లకు - బృందావనములో కుక్కలూ, కోళ్లు, గుళ్లు, గోపురములకు, కాదుకాదు సమస్త విశ్వానికి అధిష్ఠానము. జీవునికి అట్టినిశ్చయబుద్ధి గలిగిననాడు తదభిన్నుడని గుర్తించుతాడు. ఆత్మేతరములన్నీ అనుకొని వ్యవహరించేవేగాని నిజములు కావు కల్పితములు.

బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చ, దేవేంద్రో దేవతా స్తథా।
ఆదిత్యాది గ్రహాశ్చైవ, త్వమేవ రఘునందన ॥
తాపసా ఋషయ స్సిద్ధా, స్సాధ్యాశ్చ మరుత స్తథా।
విప్రవేదా స్తథా యజ్ఞాః, పురాణం ధర్మసంహితా ॥
వర్ణాశ్రమా స్తథాధర్మా వర్ణధర్మా స్తథైవచ।
యక్షరాక్షస గంధర్వా, దిక్పాలా దిగ్గజాదిభిః ॥

సనకాది మునిశ్రేష్ఠా, త్వమేవ రఘుపుంగవ ।
వసవోష్టౌ త్రయః కాలా రుద్రా ఏకాదశస్మృతాః ॥
తారకా దశదిక్చైవ, త్వమేవ రఘునందనః ।
సప్తద్వీపా సముద్రాశ్చ, నగా నద్య స్తథాద్రుమాః ॥
స్థావరా జంగమాశ్చైవ, త్వమేవ రఘునాయక ।
దేవతిర్య ఙ్మనుష్యాణాం, దానవానాం తథై వచ ॥
మాతపితా తథా భ్రాతా, త్వమేవ రఘువల్లభ ।
సర్వేషాం త్వం పరంబ్రహ్మ, త్వన్మయం సర్వమేవహి ॥
త్వమక్షరః పరంజ్యోతిః, త్వమేవ పురుషోత్తమ ।
త్వమేవ తారకం బ్రహ్మ, తత్త్వోఽన్యం నైవకించన ॥
శాంతం సర్వగతం సూక్ష్మం, పరం బ్రహ్మసనాతనమ్ ।
రాజీవలోచనం రామం, ప్రణమామి జగత్పతిమ్ ॥
రామాయ రామభద్రాయ, రామచంద్రాయ వేధసే ।

వాసుదేవ! ఈపై భావముతో సమస్తము రాముడని నిత్యము నమస్కరించు అభ్యాసము చేయవలయును. భక్తు లందరకు నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి



వాసుదేవః శ్యామ్. బృందావనబిహారీకీజై, బృందావనం 16-3-75

భక్తి భక్త భగవంత గురు రూపంతోనే కాదు - అభక్తి-అభక్త. భగ (మాయ) అగురురూపంతో - తాండవమాడుచున్నాడు. మాధవుడు. ఇదేకదా శ్రీమద్భాగవతం యొక్క సారం-వాసుదేవ! ఇక్కడ వస్త్రాపహరణ సమయంలో, గోపకులు-మూడలు-వారివారి ఆభరణాలు-వస్త్రాలు-

చల్దులు-వాటి ఉట్లు-వత్సలయొక్క పలుపులు అంతేకాదు పై వారు తిన్నటువంటి ఆహారపదార్థాలు - మలమూత్రాలు అన్నీ శ్రీకృష్ణుడేనని అన్నగారైన శ్రీ బలరాముడు గుర్తించాడు.

అయితే ఆలా అనుభవంగా ఎరుంగుటకే భాగవతాన్ని చదవాలి-వినాలి-మననం చేయ్యాలి-అలసిపోవాలి. వాణ్ణే అంటిపెట్టుకు పోవాలి. ఏ యే రూపంతో ఎన్నెన్ని జీవులందు-పదార్థములందు అంటిపెట్టుకుండుట జరుగుతోందో అన్నిటికి అన్ని శ్రీ శ్యామసుందరుడేకదా ! ఈ అనభవం రావాలా? రాలేదా ? రాకుండా వుందా! ఇది ప్రత్యక్షంగాదు. నిత్యాపరోక్షమే-నిత్యాపరోక్షమే-నిత్యాపరోక్షమే. అపరిచ్ఛిన్నమైన నేనే పరిచ్ఛిన్నంగా భ్రాంతివలన తోస్తోంది. అది భాగవతం తొలగిస్తుంది. సత్యం ! సత్యం !! సత్యం !!! నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర.

---

శ్యామల, తెనాలి హైదరాబాదు, 31-5-75

వాసుదేవ, నారాయణస్మరణలు. అతని దివ్యాశామయురాలివి. సర్వమూ గనుక నీవునూ, యిప్పుడు యీ భావం యింకా ప్రియమగుచున్నది. "సత్యపి భేదాపగమే నాథ తవాహం, న మామకీన స్త్వం" అని భగవత్పాదులు అన్నారు. అవును ఇప్పుడే బహురుచిగా వుంటోంది.

వాసుదేవ! భద్రాభద్రములు వాసుదేవుడేఅని తెలిసిన తరువాత మధురమే మధురం. అదే అరిషడ్వర్గాలు

కూడాను అనియే పరిపూర్ణ భగవదనుగ్రహముగల మహాత్ములు అందించినారు. "స ఏవ సర్వం పరమార్థ భూతం" అబ్బా! భాగవతం యేమి అమృతం అందించిన దమ్మా! "కృష్ణస్తు భగవాన్ స్వయం, భక్తస్తు భగవాన్ స్వయం" అని వేరే అనుకోవాలా యేమి? "యత్కించి భూతం ప్రణమే దనన్యః" అని శ్రీమ ద్భాగవతం అందించింది.

భాగవతం రసస్వరూపం. "వాల్మీకే ర్వదనారవింద గళితం" అని రామాయణం వలె, "నిగమతరో ర్గళితం" అన్నారు శ్రీభాగవతాన్ని. విశేషం మరొకటి. "శుకముఖా దమృత ద్రవసంయుతం" భాగవతం శుకాచార్యులనే చిలుక కొరికిన కల్పవృక్షపు ఫలం. వాసుదేవ! గోవింద! ముకుందా! కృష్ణ!

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

శ్రీయుత. రామదాసు, నారాయణస్మరణలు. తాడేపల్లిగూడెం
జయతు జగన్మంగళం హరేర్నామ. 26-8-63

నాయనా! నీవు యెంతో యథార్థముగా వ్రాసిన ఉత్తరం చూచినాను. "మమ మాయా దురత్యయా" అను శ్రీ భగవానుని వాక్యము లసత్యములుకావు. కాని ప్రక్కనే వుపాయమునుగూడా చెప్పినాడు.

"మా మేవ యే ప్రపద్యంతే ! మాయా మేతాం తరన్తితే" అని అందున నామప్రపన్నతయే సర్వోత్తమము చూడు. నీవు, నాను ప్రత్యక్ష ఉదాహరణము ప్రమాణము.

శ్రీరాము యనగా మాధవరామ్ గనబడుచున్నాడు. షుమారు రెండు నెలలు నుంచి ఆత్మను నమ్ముకొని శ్రీశైలంలో మండపంలో బయట భిక్షుకులుండే చోట యుంటున్నాడు. ఆతన్ని శివుడే చూస్తున్నాడు. అంత తీవ్రంగా యెన్నడైనా భగవన్నామం జేశామా. అతను జెప్పిన మాటయందు నమ్మిక గల్గియున్నామా! వాచారంభణం వక్కటే చేతనైనది. అదే నేనుకూడా. మనస్సును చూచుకొని యేడుస్తున్నదే. మనం గృహస్థమార్గంలో లేకున్నా విరక్తిమార్గంలో ఉండి దానికి తగినంత విశ్వాసముతో విచారణ చేయలేని అధోగతిలోనే యుంటున్నాము. మనస్సును బట్టి చూస్తే యీదొంగ వేషములన్నీ ఋజువౌతున్నవి. మనము నిరంతరం ఏదో విధంగా భగవన్నామం చేయటమేగాని దాసోహం చేతకాదు. సోహం అసలే చేతకాదు.

"నామజీహా జపి జాగహీ జోగీ విరతి విరంచి ప్రపంచ వియోగీ" నామము ప్రేమపూర్వకంగా రాగతాళాదుల యందు మనస్సుపోసి అనురాగభరితులమై చేస్తేనే నామం వంటపట్టి తిన్న అన్నం జీర్ణమైపుష్టి, తుష్టిని కల్గించి బలాన్ని చేకూరుస్తుంది. ఇచ్చట నిరంతరం ప్రేమతో రాగతాళాదుల యందు దృష్టిని ప్రత్యేకించి పోసిక, చేసిన భగవన్నామము, తృప్తిని, సుఖాన్ని, శాంతిని, పరమానందాన్ని ప్రసాదించును. ఇది నానిజమైన యుద్దేశ్యం. కనీసం పారాయణానంతరం 25000 వేల నామజపం చేసి రోజు నిద్రపో, లేనిచో ఆదినం ఉపవాసం చెయ్యి. చూడు అందరివిషయం నేను చెప్పను. వారంతా స్వతంత్రులు. ప్రతివిషయం నాకు చెప్పి

నీబాధను తీర్చుకొంటావు. నాలో ఏభావమున్నా నీకు చెప్పక నాకు నిద్రపట్టదు. కనుక నీకు నావలె రాగముల మీద బహుమోజువున్నది. అది రోగముగాని, మరొకటి కాదు. నామనస్సును చూచి నేనుకూడా దానిని ఆరోగాన్ని తెలుసుకున్నాను. కేవలం నామనస్సును చూచి వ్రాయు చున్నాను. ఇవి నాకూ సలహాలే. పరోపదేశములు మాత్రమే కావు. యెన్నటికైనా సరే, దృఢంగా గాఢాను రాగంతో నామంలో మునగాలి. మొదట పైభావాలు కుదరకపోయినా ప్రారంభించి చేస్తే దృఢత్వమూ, అను రాగమూ, ఏకాగ్రత, నామం ప్రసాదిస్తుంది. అని మనకు ప్రత్యక్షంగా మాధవరామ్ యెదురుగా కనుపిస్తున్నాడు. నాయనా రామదాసు (1) తనతప్పు తాను చూచుకొను టము. (2) ఇతరులను పొగడకుండుటయు. (అంటే భక్తుల నని కాదు అర్థము.) ధనమే జీవనముగా కలవారని అర్థము. (3) నామరసాస్వాదనము (4) నిరంతర నామజపము. మనకు యీ నాలుగే మహావాక్యాలు. అని నానిశ్చితాభి ప్రాయము. నీవుకూడా చేతనైనంతవరకు ప్రయత్నించి చూడు. ఇతరులకు బోధించుటకంటే తను ఆచరించిననాడు వారిని ఆదర్శముగాగొని తరింపగలరు. భక్తులందరికి నారా యణస్మరణలు.

— హరేరామ్ వాసుదేవ ।

జయతు జగన్మంగళం హరేర్నామ. నగరి
వాసుదేవస్వరూపా! నారాయణస్మరణలు. చిత్తూరు జిల్లా 11-7-74

ప్రస్తుతం ఇచ్చట శ్రీరమణాశ్రమంగారికి బాగా అనారోగ్యంగా యున్నందున చికిత్సకై వచ్చియున్నారము. ఇక్కడనే కొద్దిరోజులు వుండవలసి ఉంటుంది. తదనంతరం అరుణాచలం వెళ్ళేదము. నాయనా రామదాసు నీ వుత్తరం చూచి నేనెంతయో ఆనందాన్ని పొందాను. కారణం శరీరపతనావస్థలో కేవలం ప్రభుమయంగా జీవించుటకై తల్లి దగ్గర వున్నా, దేహసంబంధమున మోహము జనించవచ్చుననే భావంతో నన్ననుగ్రహించువాడు జగన్నాథుడే. ఇప్పుడు కాకపోయిన మరికొంత కాలానికైనా దీన్ని వదలక తప్పదు కనుక దేహసంబంధం దగ్గర ఉండక ఆత్మసంబంధ సత్సంగ సమాగమము దగ్గర ఉంటేనే దేహభావన లేక దైవభావముతో జీవించుట జరుగును. ఉపాధికి ఏదోరూపమున జడ సుఖాన్ని కల్గజేయక ఇంద్రియ సుఖములకు లోనుగాక ప్రేమ మయుడగు పరమేశ్వర చింతనమే ఈ స్థితిలో ముఖ్యావసరము. రోగమని దీనికి సుఖమును కల్గజేయుటకు ప్రయత్నించిన విషయములలో జొచ్చి విషముకంటె ప్రాణహానిని కల్గజేయును. విషం అప్పుడే చంపును. విషయము చచ్చేవరకు చంపుచుండును. కనుక వీటినుండి దూరంగా ఉండాలంటే నిరంతరం నామస్మరణ.అప్పుడప్పుడు మనస్సును అంతర్ముఖంగా తిరిగి అమృతవాగ్భవా చార్యులు చెప్పిన పద్ధతిగా సాధన చేస్తుంటే బాధలు బాధలుగా తోపక భగవంతుడుగా తోచును. భక్తులందరికి నారాయణస్మరణలు తెల్పుము.

— అవధూతేంద్ర సరస్వతి.

శ్రీ శాస్త్రిగారికి, హరేరామ్. ప్రకృతిఆశ్రమం, భీమవరం
23–4 61

తన పాపములవలెనే ఇతరులపాపములను తలంపని వానికి పాపములు సంభవించుటకు కారణములేదు.

ఎవడు మనస్సు చేతగాని, వాక్కుచేతగాని, శరీరము చేతగాని ఇతరులకు అపకారము చేయునో వానికి అట్టి కర్మ లనెడి బీజమునుండి జన్మయనెడి ఫలము గలుగుచున్నది. గొప్ప దుఃఖమున్ను గలుగుచున్నది.

శ్రీహరి సర్వభూతమయునిగా దెలిసికొని భక్తులైన వారు సకల భూతములయందును నిశ్చలమైన భక్తి చేయ వలయును.

ఆ పరమాత్మ జగన్నాథుడు. జగన్మయుడు, సర్వ భూత స్వరూపుడు, గోవిందు డెట్టివాడు? వీడు పాపి, వీడు దుర్మార్గుడు, వీడు పుణ్యాత్ము డను ప్రసక్తి వదలి సర్వత్ర ఉన్న నారాయణుని భక్తిచేయవలయును — ఉపాధికి జీర్ణ కోశము సరిగా లేదు. ఆహారము ఏమియు ఇముడుటలేదు. క్రమంగా...... — హరేరామ.

---

హరేరామ్. భీమవరం, 14-9-61

హరేరామ భజనమాల మనోఏకాగ్రతకు అమోఘ ఉపాయము. ప్రతిమంత్రమును సంపూర్ణదృష్టిని ఉంచి చూచుచూ జపము చేయవలయును. సాధకులు మాలతో జపముచేయుచు ఏకాగ్రతను సంపాదించు వారు చాల

అరుదు. గాని చాలమంది జపములో మనస్సు స్థిరముగా నుండటములేదని బాధపడుతూ వుంటారు. నిజముగా వారు ధృఢ ప్రయత్నం చేసేవారు కారు. దృఢప్రయత్నం గల వారికి ఏకాగ్రత సాధ్యమే. అట్టి దృఢ ప్రయత్నముతో చూచుచూ జపముచేయుట ఒకటి. ఒకే మంత్రమును చూచుచు చదువుట యేమిటని అశ్రద్ధగా పారవేయక (హరే రామభజనమాల గ్రంథము) నిత్యము ఒక పర్యాయమైన సంపూర్ణదృష్టిని ఉంచి 108 సార్లు వున్నమాల (పుస్తకము)ను జపించండి. నిశ్చయముగా ఏకాగ్రతను పొందగలరు. సత్యము! సత్యము!! సత్యము !!!

— అవధూతేంద్ర సరస్వతి.

---

శ్రీ శాస్త్రిగారికి సప్రేమహరిస్మరణలు. బృందావనం 11-8-62

పరమేశ్వరానుగ్రహమున భక్తులందరు సకుశలమని తలచెదను-భగవన్నామస్మరణ చేయు పుణ్యాత్ములు ఎచ్చట నున్నను వందనీయులె. అట్టివారియందు భక్తియున్న మరియు విశేషము. భగవానుని పలుకు "నా భక్తుడు-భక్తుడుకాడు. నా భక్తులకు భక్తుడు నాకు సర్వోత్తమ భక్తుడు" అని శెలవిచ్చినారు.

యే మే భక్తజనః పార్థ న మే భక్తాశ్చ తే జనాః ।
మద్భక్తానాం చ యేభక్తా, స్తే మే భక్తతమా మతాః ॥

ఆదిపురాణం.

అందుకనే భగవద్భక్తుల పాదధూళి నాశిరమున దాల్చే దెన్నటికో? అని మహాత్ములు పరితపించారు.

ప్రస్తుతము బృందావనమందుండుటచే భక్తుల దర్శన భాగ్యము మాత్రమే గలుగుచున్నది. పాదధూళి శిరమున ధరించు భాగ్యము లేకున్నది. కారణము - దురాగ్రహామె యని తోచుచున్నది. దానినే మాయా విజృంభణ మంటారేమో! ఇట్టి పొరపాట్లలోబడి స్వసాన్నిధ్యమునకు దూర మవుతాడు జీవుడు. అధ్యాసవల్ల (మిథ్యాజ్ఞానము) అనర్థముల పాలౌతూ ఉంటాడు. కాని ఒక ప్రబల విశ్వాసమున ధైర్యముతో నుండగలుగు చున్నాము. కేవలము శ్రీ భగవన్నామము మాత్రము మరువకుండ జపించుచూయున్న చాలునను తలంపె - అప్పుడప్పుడు ఒక్కొక శ్లోకము కనుపించునపుడు మరింత ఉత్సాహము గలుగుచుండును.

నామైకం యస్య వాచి స్మరణపథగతం శ్రోత్రమూలం గతం వా
శుద్ధం నిశుద్ధవర్ణం వ్యవహిత సహితం వారయే ప్యేవ సత్యమ్
కచ్చే ద్దేహద్రవిణజనతా లోభ పాఖండ మధ్యే
నిక్షిప్తం స్యా న్న ఫలజనకం శీఘ్రమేవాత్ర విప్ర ॥ ప. పు.

ఈ క్రింది శ్లోకము గూడ భగవద్భక్తులు నిత్యము మననము చేయదగినది. భగవత్ప్రియుల జీవితము ఎటులుండును? ఎట్లు జీవించెదరు? అనివర్ణన.

వాగ్భిః స్తువంతో మనసా స్మరన్తః
తన్వా నమంతోఽప్యనిశం న తృప్తాః।
భక్తాః శ్రవన్నేత్ర జలాః సమగ్ర
మాయుర్హరే రేవ సమర్పయన్తి॥ హరి. భ. సు.

ఆహాహా! అట్టి భగవత్సేవా భాగ్యము గలుగుట యెన్నటికో గదా! అట్టి మహాభక్తుల పాదధూళి శిరమున ధరించు టెన్నటికోగదా! అందుకనే దేవతలంటారు.

హరికీర్తన శీలా వా, తద్భక్తానాం ప్రియోపివా।
శుశ్రూషద్వా (ర్వా) పి మహతాం, సవంద్యోఽస్మాభిరుత్తమః॥
— శ్రీరామ జయరామ జయజయరామ.

---

హరేరామ్. గౌరీకుండు, 19 9–62

భగవాన్ కృపా కటాక్షమున 13 వ తేదిన బయలుదేరి నాము కేదారయాత్రకు 14 వ తేది అలకనంద-మందాకినీ సంగమస్నానము. రుద్రనాథుని దర్శనము, 15 గుప్తకాశి, మహిషాసుర సంహార మొనరించిన మహిషమర్దనిని, 16 శివపార్వతీ వివాహస్థలము, త్రియుగీనారాయణము. ఆనాటి యగ్ని యీనాటివరకు ప్రజ్వలింపబడుచున్నది. 17 గౌరీకుండము, ఉష్ణజల (76000 అ. ఎత్తు) 18, 19 కేదారం, 18 న మంచుపడి విపరీతచలిబాధ ఒక గంట కలిగినది. మ. 12000 అ. ఎత్తునుండి 6000 అ. ఎత్తుకు దిగి వచ్చాం. ఇచట ఉష్ణోదకం. వెళ్లినపుడు 7మై గుర్రం. ఉపాధి ఆరోగ్యముగానున్నది. భగవత్కటాక్షము. భగవన్నామ మహిమ. జై కేదారనాథ్.

— అవధూత.

శ్రీ శాస్త్రిజీ బదరీయాత్రపీపల్ కోట్

అనేక నారాయణస్మరణలు. 23—9—62

హరేరామ హరేరామ రామరామ హరేహరే।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

జై బదరీవిశాలకీ. మేము కేదారనాథయాత్రచేసి యిపుడు శ్రీబదరీనాథ దర్శనార్థము వెళ్లుచున్నాము. బహుశః 27 వ తేది సాయంత్రమునకు చేరుకొనగలము. వర్షాటంకమున, 80 మై. నడక ప్రయాణము తగిలినది.

భగవన్నామప్రాశస్త్యము యేమరక సమయమును సదా నామోచ్చారణ యందు గడుపుకొనుట, యింతకంటె ముఖ్యమైనది ఆచరించుటకు మానవజీవితములో మరొకటి ఉన్నదా ! లేదులేదులేదు. అట్టి దశ దృఢప్రయత్నముతో పూనుకొన్నవారలకే గదా! అన్యథా దుర్లభము దుర్లభము. ఎక్కడ పుట్టితేనేమి ? ఎట్లా బ్రతికితేనేమి ? అంతయు భగవన్నామముతో సార్థకమగును. ఇదే శాస్త్ర నిశ్చయము.

— హరిఃఓంతత్సత్.

---

శాస్త్రిజీ ।

వాసుదేవ స్వరూపా । నారాయణస్మరణలు

మీ జాబునుచూచితిని. భగవదిచ్ఛకు భిన్నంగా ఏమీ జరుగదు. అని గుర్తిస్తూ ఉంటే బుద్ధియోగాన్నికూడా ఆయనే యిస్తూవుంటాడు.

ఆయన భజనకన్న శాంతికి వేరు మార్గంలేదు. ఆయన హస్తం లేకుండా ఏమీ జరుగదు. కారణుడు అతడే, ప్రేరకుడూ అతడే. ఈ ఉపాధులన్నీ కేవలము యంత్రములు. ఆయనను భజిస్తూ సుఖదుఃఖాలు ఆయన అనుగ్రహప్రసాదమే నని భావించుటయే ఆయనను వదలకుండా యుండటము-వాసుదేవా! అందరకూ నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర స్వామి.

---

వాసుదేవ స్వరూపా - నారాయణ స్మరణలు.

ఆరోగ్యము సామాన్యముగా ఉన్నది. భగవత్కృప వలన గిరిప్రదక్షిణములకు భంగము లేకుండ జరుగుచున్నది. భగవంతుని నమ్మినవాడు ఎన్నడు చెడడు. వాడు చేయవలసినపని ఆయన యే చేయిస్తాడు. భగవంతుని కటాక్షము ఎవని యందు ఎపుడు ఏ విధముగా ప్రసంరిచునది తెలియదు. మన చేతిలో నున్న దనుకొనుట పొరపాటు. అజ్ఞానం. ఆయన ఆజ్ఞలేకుండ గడ్డిపరక కూడ చలించదు పరమశివానుగ్రహమున రాత్రి గిరి ప్రదక్షిణ సమర్పణ జరిగినది. భక్తులందరికి నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

---

అమ్మా సప్రేమ నారాయణస్మరణలు. హైదరాబాదు, 24-10-69

అమ్మా నీజీవితంలో భగవంతుడు చాల సమస్యలు తెచ్చినట్టుగా గనిపిస్తోంది. అమ్మా యివిదేవతావిఘ్నాలేమో ననితోస్తూయుంటుంది. వాండ్లకు భగవంతుని సమ్ముఖంగా

వెళ్లే వాండ్లను జాస్తే. ఏమేమో అద్భుతగలా లనిపిస్తూ యుంటుంది. కారణం-స్వర్గసుఖాలనుగూడా అతిక్రమించా లనుకుంటున్నా రని, లేక సాధకుల యొక్క సాధనాపరీక్ష యేమో! అంతేగాని జీవితంలో కష్టసుఖాలకు ఇంతకన్న భగవదాశ్రయులకు యేముంటుందమ్మా! ఉత్సాహముగా బాలరామునిలాగ నిర్వికారంగా వుండాలమ్మా! భక్తులందరికి నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతి.

---

పితాజీ యం. సోమేశ్వరరావు కుర్తాళం
భీమవరం 6 6--66

శ్రీపితాజీ సోమేశ్వరరావు గార్లకు ప్రేమపూర్వక నారాయణస్మరణలు......ఇచటి ప్రకృతి దృశ్యాలు యెలా గున్నా చింతన మాత్రం నాకు బాగా జరుగుచున్నది. నామానుగ్రహం అపారం. నామవిషయంలో సద్యోఫలితం బొందాలంటే దృఢమైన నమ్మకంతో నామమును స్మరించ వలయును(జపించవలయును)అప్పుడే సద్యోఫలితముగలుగును. "నామస్మరణా దన్యోపాయం, న హి పశ్యామో భవతరణే" శ్రీహరిని మరచుటకన్న ఆయన నామమును మరచుటలో ఎక్కువ కష్టము లున్నవి. ఎట్టి పరిస్థితిలోను భగవంతుని నామము విడువరాదు. ఎంత కొద్దికాలము జిక్కినా దానిని శ్రీహరినామస్మరణలో వినియోగింప మని శ్రీమహాత్ములు సెలవిచ్చినారు.

నామసంకీర్తన (జప)కాలమున నామం దృశ్య మను తలంపు లేకుండ జరుగుటే యుత్తమ మని నాతలంపు. సాధన కాలంలో ఎలావుంచుకున్నా అభేదజ్ఞానము గలవారికి యేమి హాని కలుగదు. రసవత్తరంగానే సాధన జరుగుతూ యుంటుంది. ఎన్నివ్రాసిన తుదకు ఆచరణలోనే గదా ఆనందం. భగవదిచ్ఛ యెన్నటికోగదా! అయినా పరవా లేదు. ఒకమాట తలచుకుంటే కొండంత ధైర్యం గలుగు తుంది. "న మే భక్తః ప్రణశ్యతి" ఎంత ఆప్యాయం. ఎంత ఉదారత. ఎట్టి సహజోద్ధారము భక్తి యెలాజేసినా స్వరూపాను సంధానమె అవుతుంది, ఎరిగితే.

— అవధూతేంద్ర సరస్వతి.



జయతు జగన్మంగళం హరేర్నామ. ఖైరతాబాదు

అమ్మా : నారాయణస్మరణలు. 12 2 68

భగవ దిచ్ఛానుసారంగానే సంకీర్తన కార్యక్రమాలు జరుగుచున్నవి. ఇందుతోనే యీఉపాధి శ్రేయస్సు కల దేమో : కోరుచున్నవారికి లభ్యమగునా! నాకే ఆశ్చర్యం "మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతే గిరిం" ఇచ్చట ఎంత ప్రత్యక్షంగా దర్శనమాతోందిగదా! మానసికంగా ఏమిబంధనవలదు. ప్రాపంచికంగా వుండకుండా యుండుటకు జేసే ప్రయత్నము చాలా సహాయపడగలదు. ఈశ్వరేచ్ఛ యున్నచో తప్పక జరుగగలదు.

— అవధూతేంద్ర సరస్వతి.

చి. సత్యవతెమ్మకు - పొమ్మూరు తాడేపల్లిగూడెం
నారాయణస్మరణలు. 1969

ప్రహ్లాదునిభక్తికి అద్వైతానికి అంతరంయేమీలేదు. భక్తితోగూడిన వేదాంతం అమృతత్వాన్ని యిస్తుంది... ప్రహ్లాదచరిత్ర కంఠస్థంజేయటం ఒకవిశేషం. మరవకుండ మననంజేసి మనసు మాధవార్పితం జేసికొనుట మరీవిశేషం. ప్రహ్లాదచరిత్ర అనే గనిలోనే ఆత్మరత్నప్రాప్తి యని దృఢ విశ్వాసంతో యితరత్ర మనసును పోనీయకుండా యుండాలి. శ్రీ నారదులుపదేశించిన జ్ఞానము ప్రహ్లాదునిది. అట్టి నారదోపదేశము కైవల్యముక్తిని ప్రసాదించజాలదని యెవ్వరూ అనజాలరు. జ్ఞానప్రాప్తి సాధనలో సాధకునకు ముఖ్యంగా యితరుల మంచి చెడ్డలకు బోకుండ యుండాలి. అనగా నిందాస్తుతులు సాధకునకు పనికిరావు. ఈ పాడు మనస్సుకు బాగా యీ దురలవాటు యిష్టము. ప్రయత్నపూర్వకముగా యీ ఆత్మఘాతకము జేసే దుష్ట స్వభావాన్ని తరిమేసెయ్యాలి.

— అవధూత.

---

శ్రీ పితాజీ సోమేశ్వరరావులకు అరవంకాడు
భీమవరం 8 6 67

ఓంనమోనారాయణ :

రెండు దినములనుండి మీరు జ్ఞాపకమునకు వచ్చుచున్నారు. కారణం ఈ క్రింది శ్లోకములె. మనోనిర్మలతకు యెంతో సత్యోపాయము. ఏకాంత లాభమునకు ఇంతకన్న మరేమి కావలెను? ఆనందము-ఆనందము-ఆనందము.

అహో బ్రహ్మమయీ దృష్టిః, పీయూషాంబుద వత్సదా ।
ఆనంద మేవ సర్వత్ర, ప్రవర్షతి నిరంతరమ్॥

ప్రపంచము యథార్థముగాదు. మిథ్య. కానవచ్చు ప్రపంచము బ్రహ్మమంటె భిన్నముగాదు. సర్వము బ్రహ్మయే యన బ్రహ్మాకార వృత్తి యుదయించినచో నది యమృత మేఘమువలె నెల్లపుడు నంతట ఆనందమునే వర్షించుచుండును.

శ్రుతం, దృష్టం, స్మృతం, పృష్టం సర్వం బ్రహ్మేతి చిద్ధియా।
పశ్యతో విదుష శ్చిత్తం, వద కుత్ర గమిష్యతి॥

తాను దేనిని వినునో, చూచునో, స్మరించునో, యడుగునో అది యంతయు బ్రహ్మమే యనెడి వివేక సంపన్నమైన బుద్ధితో నెవడు జూచుచుండునో యట్టి జ్ఞానియొక్క చిత్త మెచటికి పోగలదు?

ప్రథమావస్థలో యీశ్లోకము నిర్గుణాభ్యాస పరులకు అత్యంతోపయోగము. కామాదులు మనస్సును స్పృశింప జాలవు. పై శ్లోకప్రకారం నిరంతరం అభ్యసించి నట్లైతే - మరియొకటి.

మానుష మతఙ్గ మాహిష శ్వ సూకరా దిష్వమన్యా ః
యః పశ్యతి జగదీశం స ఏవ భుఙ్క్తే ఽద్వయానన్దమ్॥

మనుష్య, గజ, మహిష, శునక, సూకరాది ప్రాణు లన్నిటియందు అంతర్యామియై వ్యాపించి యుండు జగదీశ్వరుని దర్శించిన వా డద్వయానందమును బొందును.

పితాజీ! నాకు యిష్టమైన భావాలే మీకు యిష్టమని వ్రాయుచున్నాను. మీరు నిరంతరము మననము జేసికొను భావాలే క్రొత్తేమీకాదు. ఈ నామరూపాదుల యనుసరణమువలన వచ్చు అహంకారము మొదలగు వానియొక్క అనుసరణ అసదభినివేశము తొలగుట పరమోపాయము. ఎన్ని పుస్తకములు చదివి--, ఎన్ని సార్లు విన్నా యింత కన్న మరేమున్నది?

వాసుదేవ సర్వమిదం, సర్వం విష్ణుమయం జగత్।
బ్రహ్మ మాత్ర మిదం సర్వం, బ్రహ్మైవ కేవలం జగత్॥
ఓం తత్సత్ — అవధూతేంద్ర సరస్వతీ.

---

అమ్మా : నారాయణస్మరణలు. సింహాచలం 12-8-69

భగవాన్ కృపాకటాక్షముచే బ్రహ్మచారిగారితో పర్యటన జేయుచూ జగన్నాథం వరకు వెళ్లి యీ వుదయం ఇక్కడకు వచ్చినాను. శరీరారోగ్యం బాగానే ఉన్నది.

శ్రీ బ్రహ్మచారిగారితో బహుసంతోష జనకముగా కాలము గడచినది. తనకు పుట్టిన దూడయొక్క మలము యేలాగున ఆవు శుభ్రముజేయునో, తనను పూర్తిగ నమ్మిన భక్తునియొక్క మలముగూడ భగవంతుడు శుభ్రముజేయును. అనునది దృష్టాంతముగా చాలా బాగా జెప్పినారు. భక్తునికి వచ్చిన కించిత్ అహంకారమును భగవంతుడు వెంటనే నశింపజేస్తాడు. అందుచేతనే భక్తవత్సలుడు అను పేరు వచ్చినది. శాస్త్రములు,భక్తులుగూడా అలాగే కీర్తించుచూయుంటారు. హనుమంతుని నిమిత్తం జేసికొని-గరుత్మంతునకు సుదర్శనచక్ర

మునకు సత్యభామకు గర్వభంగము గావించెను నిజముగా జీవభావం వచ్చినప్పుడల్లా దేహబుద్ధి విజృంభించుచూ యుంటుందిగదా! భక్తియే సులభోపాయము జ్ఞానసిద్ధికి పరమ శ్రేయము. అస్తు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

సోమేశ్వరరావునకు
భీమవరం

బృదావనం
20-11-67

సకుటుంబముగా నారాయణ స్మరణలు.

నీ ఉత్తరములో చివరి 8 లైనులు పరమసత్యము. నీ మాటలన్నీ ఆత్మసాక్షాత్కారమైన వారి మాటలు. అట్టి వారికి అనుభవములో "జగత్ బ్రహ్మ" అట్టి అనుభవం కానంతవరకు మాటల్లోనే అనుభవం ఉన్నట్లుంటుంది. కేవలం తత్సంబంధమైన కృషి లోపముచేతనే. వాచా వేదాంతం ప్రయోగింపబడుతుంది. నీవు వ్రాసిన 8 లైనులు నేను హృదయపూర్వకముగా, భగవదోపదేశంలాగా నా హృదయంలో పదిలపరుచుకుంటాను. ఆత్మీయులద్వారా సుహృదయులద్వారా ఇలాంటి పరలాభమే కలుగుతుంది.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

అమ్మా ! నారాయణ స్మరణలు. భీమవరం 1-11-69

భగవాన్ అండదండల్లో చీకుచింత ఉడదని శాస్త్రాలు ప్రతిజ్ఞజేసినాయి. ఉన్నా బుద్ధివృత్తులవుతాయి గాని మరేమి గాదనిగూడ అనుభవజ్ఞులు తేల్చి చెప్పినారు. శ్రీ బాలరాముని

వలె బాలరామునితో తన్మయంగా వుండమ్మా కాకభుశుండి నీకు పూజ్యసోదరుడు గదా!

ఆయనవలె తనివితీరకుండ రాముని కథామృతం అంటూ, కంటూ, వింటూ, యుండమ్మా!

— హరేరామ,

జయతు జగన్మంగళం హరేర్నామ, నెల్లూరుపల్లి కొత్తపాలెం.
8-9-69

అమ్మా నారాయణస్మరణలు. భగవదనుగ్రహముచే సకుశలముగా శరీరమున్న ఆత్మభావముతో, భగవద్భావముతో పరమానందముగా యున్నాను. ఆహా, ఈ దినమెంత సుదినము? అమ్మా చూడుము. శుకులవారు పరీక్షిత్తుకు అంత్యోపదేశము చేయుచున్నారు.

బుద్ధీంద్రియార్థ రూపేణ, జ్ఞానం భాతి తదా శ్రయం।
దృశ్యత్వా ద్వతిరేకాభ్యాం, అత్యన్త వదవస్తుయత్॥
యథా హిరణ్యం బహుధా సమీయతే
నృభిః క్రియాభి ర్వ్యవహార వర్త్మసు।
ఏవం వచోభి ర్భగవా నధోక్షజో
వ్యాఖ్యాయతే లౌకిక వైదికై ర్జనైః॥
ద్రవ్యం కర్మచ కాలశ్చ, స్వభావో జీవ యేవచ।
వాసుదేవా త్పరో బ్రహ్మ, న్నచాన్యోఽర్థో స్తి తత్త్వతః॥

అమ్మా భగవంతుని కరుణ అపారముగదా! అందుకనే గృహాదులయందు అహంకారముతో నేను, నాదియనుకొనుట దుర్జనత్వ మనివారు.

ఏమన, సర్వము విష్ణుమయమైనపుడు మధ్యలో యీ మాట లెందుకు? దేహ తాదాత్మ్యమువలన గదా! అహా! దేహాదులు వాసుదేవాత్మకము. గాన విష్ణుబుద్ధేతగును.

అమ్మా! మాటిమాటికి ఋషులు హెచ్చరించి అన్న మాటలు బహులాభదాయకములు సుమా. ఆ ఆనందంతో వ్రాయుచున్నాను.

పరమపదమును పొందదలచువారు, ఇతరుల యొక్క కటువచనములను సహించాలి బదులుగా ఎవరిని అవమానం జేయరాదు. క్షణభంగురమైన శరీరమునందు అహంకార మమకారములతో యేప్రాణితోను వైరము గలిగి యుండ రాదు.

అతో వై కవయోనిత్యం, భక్తిం పరమయా ముదా।
వాసుదేవే భగవతి, కుర్వ న్త్యాత్మ ప్రసాదనమ్॥
పదార్థేషు యథా ద్రవ్యం, సన్మాత్రం రూపనామసు।

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

వాసుదేవ: నారాయణ స్మరణలు.
సద్గురు శ్మరణం మమ। శరణం మే తవచరణయుగళం।

వ్రజధామ అధినేత యగు శ్యామసుందర చక్రవర్తి చరణకమలముకు సహస్ర ప్రణామములు, మధురాతి మధుర బృందావన శ్రీకృష్ణ చంద్ర చరణారవింద మకరందపాన మత్త మధుపమును ఎపుడగుదునో! గోపీ కృష్ణకథాసక్తి నాకు కలుగునా? శ్రీరాధా మాధవుల నామాభిరుచి నాకు

కలుగుగాక! నామసంకీర్తన తన్మయత్వముతో నా యీ శరీరము భగవంతున కంకితమగుగాక! భక్తుల మధ్య భగవత్కథలతో నా జీవితము గడచుగాక! ప్రభూ! కృష్ణా! నేను నీవాడను. దయచూపవా! ఏకాంతమున నిత్యము సాధనచేయాలి.

— వాసుదేవ.



అందరికీ అనేక నారాయణ స్మరణలు. బృందావనం

ఎవరితో యేమి చెప్పినా యీ చేతకానివానికి తోచినది యొక్కటే యుపాయము. చేయతగినది. భోజనసమయమున, నడచునపుడు, ప్రయాణసమయమున, పరుండునపుడు, నిద్రనుండి లేచునపుడు సర్వకాలములందు ప్రేమతో శ్రీ హరి నామముచేయుటయే.

కలౌకల్మషచిత్తానాం, పాపద్రవ్యోపజీవినాం ।
విధిక్రియావిహీనానాం, గతిర్గోవిందకీర్తనమ్ ॥

— హరేరామ్.



అమ్మా ; సత్స్వరూపా ; చిన్మయీ ; జయము ; జయము ;

యథా విష్ణుమయం సత్యం, యథా విష్ణుమయం జగత్ ।
యథా విష్ణుమయం సర్వం, పాప్మా మే నశ్యతాం తథా ॥
యస్యభావోఽఖిలం విష్ణుః, తస్య నో బాధతే కలిః ।
సర్వకారణ మత్యన్తం, విష్ణుం ధ్యాయ న్నసీదతి ॥
వేదాన్త సారసర్వస్వం, జ్ఞానవిజ్ఞాన మేవ చ ।
అహమాత్మా నిరాకారః, సర్వవ్యాపీ సనాతనః ॥

న వాసుదేవా త్పర మస్తి మంగళం, న వాసుదేవా త్పర మస్తి పావనం।
న వాసుదేవా త్పర మస్తి దైవతం, న వాసుదేవా త్ప్రణిపత్య సీదతి॥

భక్తులందరికి నారాయణ స్మరణలు.

— అవధూతేంద్రస్వామి.

---

అమ్మా : వాసుదేవ : జయము జయము శ్రీహరీ!　　　రాజమండ్రి
8–1–74

శ్రీరామచింతనము దంభరహితంగా జరుగుచున్నదని సంతోషంతో వ్రాయ గలుగుచున్నాను. అమ్మా నీబిడ్డనైన నాకు నీ ఆశీర్వాదమే అన్నివిధములా పెద్ద అండగాయుండి నన్ను అనంతానందంలో ముంచగలదు.

వాసుదేవా! భగవంతుని అనుగ్రహంచేత ఆరోగ్యం గలుగగలదు. అమ్మా! అనారోగ్యం అనాథనాథుని అనుగ్రహ విశేషమేమో! దుఃఖం దైవానుగ్రహం కాకపోతే మరి కారణమేమున్నదమ్మా!

— అవధూతేంద్రస్వామి

---

యం. నాంచారమ్మ, పొన్నూరు.　　　రాజమండ్రి, 18 1 74

వాసుదేవస్వరూపా! కలిలో భగవన్నామం, భాగవతం ప్రధానసాధనాలు. భాగవతంపురాణతిలకం. భగవన్నామం సాక్షాత్ భగవానుడే. భగవన్నామానికున్న సిద్ధులు మరియే సాధనకూ లేవు.చైతన్యంభగవన్నామం. తన నిజస్వరూపాన్ని తెలుసుకున్న వాళ్లందరూ భగవంతున కభిన్నమనిచెప్పటకు పరమసాహసం భగవన్నామంవల్లనే అందుకుంటున్నారు.

భగవన్నామం యోగసారం, భక్తిప్రాణం, జ్ఞాన స్వరూపం. అనంతం, అఖండం, అవ్యయం, అనామయం, ఆత్మస్వరూపం-స్వసుఖం.

వాసుదేవ! అన్ని అనుభవరూపంగా తెలుపుతుంది. అందుకనే నారదభగవానులు మొదలగు బ్రహ్మవిద్యా సాంప్రదాయ రసికులు "నామైవ మమ జీవనమ్" అని మనందరికి అభయాన్ని యిచ్చినారు.

— అవధూత.

---

హరేరామ్ బృందావనం 28-10-61

సంతవాణి-అలలు ఆగినపిదప సముద్రస్నానము చేయ వలయునని ఆగినవాడు మూర్ఖుడు. అవిఆగవు. వానికిస్నానము గాదు. అట్లే శరీరధర్మము యొక్క నాశానంతరము నేను ముక్తిని బడయుదుననుట మూర్ఖత. ఎందుకనగా శరీరమున్నంత కాలము శరీరధర్మము లుండియే యుండును. తాత్పర్యమే మనగా అశరీరమైన ఆత్మయొక్క అనుసంధాన బలమున శరీరేంద్రియాదులు అణగి మణగియుండును. సింహమును గన్న గజములభంగి ఆత్మసందర్శనమున వాసనలు మరలును. అడ్డగింపవని తత్త్వార్థము. దేహధర్మము లుండినంత మాత్రాన అసంగమగు ఆత్మయందు సంగమును గల్పింప జాలవు. పరమ ఋషులు శరీరధర్మములు గలవారయ్యే శిష్యుల ననుగ్రహించియు, దుష్టులకు శాపమొసగియు, ధన్యులను జేసిరి.

తత్త్వవిదుని దృష్టియందు దేహముయొక్క అస్తిత్వము, తద్ధర్మములు కేవలము ఆభాస మాత్రములు. ఇవి ముక్తినిరోధకములు గావు.

శ్రద్ధతో మననీయము :—

"ఆర్యా మే నాస్తి (నాకుఅత్తలేదు) భార్యా నహి, మమ భగినీ మే నన(స్త్రీ), నధాత్రీ, భ్రాతా మే నాస్తి, యాతా నహి నుతనయో మే నబాలా, నశాలా, పౌత్రో మే నాస్తి, నహి, మమ సహభూ ర్మేన, తాతో న మాతా, మూర్తే సంబంధినోఽమీ వపురసురహితో నిర్గుణః, కేవలోఽహం" ఇది మననీయము.

అజ్ఞానమనగా స్వరూప విస్మరణే :

సత్యా! సత్యవతీ! సత్యరూపా! సత్యారూపిణీ! సన్మాత్రా! సదానందా! సంవిత్ రూపా! జయము.

— వాసుదేవ.

---

హరేరామ్ : విజయవాడ 4-3-64

శివరాత్రి వెళ్ళగానే సంగం జాగర్లమూడిలో ఉండుటకు తలచినాను. ఇంతవరకు కుదురటంలేదు. శ్రీ రామ నవమి నుంచైనా ఉండాలని యున్నది-ప్రారబ్ధబలము ఎటులాగునో తెలియదు. నిరంతర నామ జపమున ఎట్టివారికీ సిద్ధి కరతలామలకమని జెప్పినారు. అవిశ్వాసమున అట్టి మహత్తరమైన సదవకాశమును మానవులు జారవిడచు కుంటారు.

సద్గురువుల కృపాకటాక్షమున కొంతమంది పుణ్యాత్ములు నామ ఫలసిద్ధికి నోచుకొంటారు.

— అవధూతేంద్ర సరస్వతి

---

శ్రీమతి సత్యవతిదేవి : నారాయణస్మరణలు. గోలోక్ 7-6-64

ఆనందము! ఆనందము! ఎవ రెవ రెక్కడెక్కడున్నా తత్పాదాశ్రయులు. తత్సేవాశ్రయులు, తచ్చింతనపరులు, తన్మయులకు ఆనందమే. ఆనందమే. ఆనందమే. సర్వహృదయాంతర్వర్తి చైతన్యమే శ్రీ వ్రజవిహారీ నంద నందన్ రాధాగోవింద్, గురు నిష్టపరులకు అలభ్యము అసాధ్య మేమీ లేదు. జీవునకు ఏదిఎక్కువ అభ్యాసమైతే దానియందే మనస్సు లగ్నమగును. అసలందరికి తనయందే ప్రీతి. అన్యమును ఎవరూ కోరరు కోరుతున్నారంటే స్వసుఖమును ఆపాదించుకునే గాని అచ్చట సుఖమున్నదనిగాదు. అందుకనే తత్పరులను, పరవశులను చేయుటకు మిగులువుండదు. అది ఎట్లు లభ్యము? శ్రవణ మనన కీర్తన సత్సంగాదులే. భక్తులందరికి నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర.

---

సత్యవతిదేవికి నారాయణస్మరణలు. భువనేశ్వరము 12-8-64

శ్రీ గురువులు అఖండమైన, అమృతమైన, అద్భుతమైన ఆత్మతత్వానుభూతికి పరమానుగ్రహముతో మంత్రమును ప్రసాదించుతారు. తన్మంత్రమునందు అత్యంత శ్రద్ధాభక్తులు గలిగిన శిష్యులు ఆమహత్తరమైనటువంటి, అఖండ

మైనటువంటి ఆత్మతత్త్వమును మంత్రానుగ్రహమున పొందుతారు. సంశయ సందేహరాహిత్యులౌతారు. అట్టి మహత్తర తత్త్వమునకు అభిన్నములే ఈ సర్వనామ రూపములు. విష్ణువు విశ్వరూపుడే. అనగ విశ్వం-విష్ణువె. లేక వైష్ణవియె. మాతానుగ్రహమున జగత్తు జగదీశ్వరుడే అను దృఢనిష్టగలుగును. సత్యము-అనునది గూడ శ్రీమాతృ అనుగ్రహముననే తెలియును. సీతారామ్. సీతారామ్.

— అవధూతేంద్ర సరస్వతి.

---

సప్రేమ హరిస్మరణలు. అరవంకాడు 7-6-71

భాగవతం ఏకాదశ స్కంధం చదువుతూయుంటే యీశ్లోకం వచ్చింది. ఎంతో ఆనందమైన విషయం. ఆత్మీయులే గదా! కాదుకాదు. తదభిన్నులే గదా యను సంతోష భావంతో వ్రాయుచున్నాను. సర్వులకు పరమానందమును, దుఃఖ రాహిత్యమును నగు మార్గము. మనకు శాస్త్ర మాతయేగదా! ఆశ్రయము ఆ తల్లి యాదేశము - తన బిడ్డల మని తలచువారికి యింతకన్న కర్తవ్య మేమిగలదు? అస్తు—

> ఖం వాయు మగ్నిం సలిలం మహీంచ,
> జ్యోతీంషి సత్వాని దిశో ద్రుమాదీన్ ।
> సరిత్సముద్రాం చ హరే శ్శరీరం
> యత్కించ భూతం ప్రణమే దనన్యః॥ భా. ౧౧ స్కం.

పంచ భూతములు, సూర్య చంద్ర నక్షత్రములు, ప్రాణులు, దిశలు, వృక్షములు, లతలు, అన్నవన్నియు

శ్రీహరియొక్క శరీర మని నమస్కరించుచుండవలెను. (అనన్యభావముతో)

హరేరామ హరేరామ రామరామ హరేహరే ।।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ।।
శివ శివ శివ సర్వంత్వమేవ, శివ శివ శివత్వమేవ సర్వం.

— అవధూతేంద్ర.

---

హరేరామ తా॥ గూడెం, 26–6–69

అమ్మా! నారాయణస్మరణలు. ఆరోగ్యం బాగానే యుంటున్నది. కాలు నొప్పి తగ్గలేదు. నడచుటలేదు. కుంతీ అమ్మకోరు కున్నట్లు వూహించని బాధలు శరీరానికి రావటము మంగళకరమే గదా! బుద్ధిని సదాశ్రయంలో వుంచక పోతే చిరంజీవిలా శరీరాన్ని వుంచాలనుకుంటుంది. బుద్ధికి సదాశ్రయం దృఢప్రయత్నంతో గలిగించాలిగదా! లేక పోతే అది దేహంతోనే పొత్తుగలిగి యుంటాను అంటుంది. అందుకనే 'అహర్నిశం పరిచింతనీయం శివాత్మతత్త్వం' అన్నారు. శంకరులు.

— హరేరామ.

---

అమ్మా ! నారాయణస్మరణలు.

అచ్యుతా! అనంతా! అజరా! అమరా! ఆనందా! సత్యా! సనాతనా! సాంబా! ప్రమాణ! ప్రమేయ! ప్రమాతా, త్రిగుణా! సగుణా! అగుణా! సమతా! అనమతా! ధాతా! శ్రద్ధా!అశ్రద్ధా!విశుద్ధా!ప్రియా!అప్రియా!

సుప్రియా! ప్రత్యక్-ఆత్మా! అంతఃకరణా! జరామరణ వ్యాధిరూపా! సత్ చిత్ ఆనందా! అహమాత్మస్వరూపిణీ! మహదాత్మస్వరూపిణీ! నిరంజనా! నిర్వికల్పా! నిత్యా! సర్వ సర్వగతా! సత్యసనాతనా! సామా! సాధ్వీ! సాక్షీ! జయమా! జయమా!

వ్యాధిరూపవిలాసముగూడ ఆత్మాభిన్న జగత్తువలె అధిష్ఠానాభిన్నమే. ఆనందము - అనానందము - జననము - మరణము - ఇహము - పరము - అన్నిటికి అధిష్ఠానమైన నేను సర్వమంగళము, మహత్పావనము, అతిమధురము. అమ్మా !

— అవధూత.

---

శ్రీ మీనాక్షీగురుస్వామి మొదలియార్ తరగటూరు-19

భీమవరం

హరిస్మరణలు! అంబ! జగదంబ! దుర్గ! మదంబ! భవాని!

భాగవతం శ్రవణం జరుగుచున్నదిగదా! విన్నటువంటి కథాసుధను మరువక నిత్యము సంకీర్తనాదులయందు, పూజాదులయందు మననము జేసుకొనవలెను. శ్రవణంలో నీది మొదటి తరగతి అని వ్రాసినావు. నిజమే స్త్రీలు వారికే కలిలో ఆప్రాధాన్యత విశేషముగా యున్నది. అందుకే స్త్రీ సాధు అని వ్యాసులవారు గూడ పలికినారు. జై మాతా పూతానుకంపా సమేతా, దుర్గే అపవర్గప్రదాయిని.

— అవధూతేంద్ర సరస్వతి.

సావిత్రమ్మ, తెనాలి. భీమవరం

నారాయణస్మరణలు ! 12-4-61

రఘువర తవమూర్తిం ర్మామకే మానసాబ్జే
నరక గతి హరం తే నామధేయం ముఖే మే ।
అనిశ మతులభక్త్యా మస్తకం త్వత్పదాబ్జే
భవజలనిధి మగ్నం రక్ష మా మార్తబంధో ! ॥

మనః కమలమునందు శ్రీ రాఘువుని సుందరస్వరూపము, నరక మార్గమును తొలగించు నీనామము ముఖమునందు, నిరంతరము అతులనీయ భక్తితో నీ పాదపద్మముల యందు నా శిరస్సు నుండునట్లు, భవజలధి మగ్నుడనైన నన్ను హే ఆర్తబంధో ! రక్షింపుము.

ధ్యానవిధానము సుళువైనదే! తనకు అత్యంత ప్రియమైన వస్తువు ఎప్పుడూ జ్ఞప్తిలోనే ఉండటము సహజము. ఇది అందరికి అనుభవమే. అట్టి ప్రేమ భగవంతుని యందు గలుగునట్లు గట్టిగా ప్రయత్నము జేయవలయును. అట్టి దృఢ ప్రయత్నమున మరణసమయమున అదియే భావమున మరుస్థితిని బొందును. పైకి భగవన్నామం ఎంతజేస్తూన్నా, అంతా బ్రహ్మమే అనుకున్నా, నాకు ప్రాణతుల్యం శివుడనుకున్నా లోపల నున్న వాసన అసలు సమయానికి బయటపడుతుంది. ఉదాహరణముగా వ్రాయుచున్నాను. ఆంతరంగిక వాసనల వలన మనోనిగ్రహము జిహ్వాకును అరికట్టడము చేతకానివలన తన ఉపాస్య దేవునికంటే యిష్టమున్నకూర ప్రియమంటారు. వదలలేరు. నమ్మినవారిని ప్రేమించి తరింపజేసేది భగవం

తుడు గాక నిశ్చయముగా అన్యులు లేరు. గాని వాసనలచేత వస్తువులు, ప్రాణులు సమయానికి భగవంతునికంటె జ్ఞాపకమునకు వచ్చి పునర్జన్మకు హేతువగును. అట్టి ప్రమాదము తొలగగలందులకు ఆత్మ స్వరూపమైన ఇష్టదేవుని బాగా ప్రేమించమని, దృఢముగా కీర్తించమని, శాస్త్రములు, మహాత్ములు చెప్పుచున్నారు. గోంగూర యిష్టమైతే అవి వండినవాడు తినకపోతే ఆ ప్రేమ భగవంతుని మీదకు మరలగలదు. మనస్సుకు అన్యమైనది యిష్టమైతే దానిని తక్షణం వదలటమే శ్రేయస్కరము. లేకపోతే జిహ్వ ప్రాణం తీస్తుంది. మనస్సు గోతిలో పడేస్తుంది.

అసలు తరచితరచి విచారించినచో తాను తనకు ప్రియమైనట్లు అన్యవస్తువులుగాని, ప్రాణులుగాని యెన్నడు ప్రియము గారు గారు గారు. అన్యులవల్ల సుఖదుఃఖములు గలుగు చున్నాయంటారు. అవి నిజమయితే ఒకరికి సుఖంగా వున్నది.-ఇంకొకరికి దుఃఖదాయక మాతోందే! ఒకరికి దుఃఖదాయ ముగా వున్నది - ఇంకొకరికి సుఖముగలిగించుచున్నదే! ఇదంతా కేవలమూ విచారలోపమే. నిరంతరము ప్రేమతో యేమిజేస్తూన్నా, భగవన్నామమును గీర్తించుతూ ఉంటే ఆయనయే బుద్ధిని ప్రసాదించగలడు.

భోజన సమయంలో సరోజనమ్మ దంపతులు పిల్లలు వాసుదేవదంపతులు అందరు ఎవరికి బుర్లు రాకుండ భగవన్నామ స్మరణతో ప్రసాదమును తీసుకుంటున్నారని తలంచెదను. ఒకమాట-పిల్లలకు కొత్తగుడ్డలు కుట్టించినా భగవన్ని

వేదన అనగా అర్పించి ప్రసాదముగా వాడుకొనవలెను. భగవద్భావమున భవము నశించును. శ్రీరామ నామం కలి దావానలమునకు చల్లని జలమువంటిది. కలి మహావిటపమునకు శ్రీరామనామము కుఠారము వంటిది. దురంత దుర్దాంత దుర్గమ బాధల నివారణకు రామనామము అమృతమువంటిది. మర్త్యాది బ్రహ్మలోక పర్యంతముగల సంపదలను తృణీకారము జేయునది శ్రీరామ నామము. కష్టములను సుఖములుగా ననుభవింప జేయునది శ్రీరామ నామము. ఉపాసకులకు యిష్టమైన వస్తువు భగవంతుడే. అన్యముండరాదు. భక్తులందరకు నారాయణ స్మరణలు :

— అవధూతేంద్ర సరస్వతి.

గుంటూరు సీతారామ శాస్త్రిగారికి, రాజమండ్రి
వాసుదేవ స్వరూపా, పాల్వంచ :

సకుటుంబముగా నారాయణ స్మరణలు. మీరు ప్రేమతో పంపిన M.O. అందినది అంతమాత్రం చాలును. మీరు మానసికంగా యేమి తలంచవలదు. మీరు పంపినది కేవలం భిక్షకే వినియోగించుతాను. వడ్డీ వ్యాపారస్తుల ద్రవ్యాన్ని అంగీకరించాలని లేదు. అందుచేత మీకు వ్రాశాను. ప్రస్తుతం ఏమియు అవసరంలేదు.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

చిన సత్యవతమ్మ, పొన్నూరు.

జయతు జగన్మంగళం హరేర్నామ! చి. సీతమ్మకు నారాయణ స్మరణలు. 22-1-69వ. తేదీన వ్రాసిన ఉత్త

రానికి వెంటనే జాబు వ్రాయలేక పోయితిని. మీ ఉత్తరం జూచి చాలా సంతోషమైనది. భాగవతము, బ్రహ్మ సూత్రములకు వ్యాఖ్యయని గరుడపురాణమునందు యున్నది. గాన, యేకాదశస్కంధము ఒక్కటే గీతకు విపులార్థముని గూడా మహాత్ములంటున్నారు. సరళంగా, సరసంగా భాగవత ధర్మమంటూ జెప్పుచూ బ్రహ్మప్రాప్తికి యీ కలిలో యిదే సుమా పరమాదరణీయముని, కృష్ణ భగవానులు పదే పదేఉపదేశించినారు. అమ్మా! మీరిరువురు యీక్రింది సాధనను పట్టుదలతో అభ్యసించిన సవిధిగా శ్రవణము మననము నిధిధ్యాసము జేసిన సాధన చతుష్టయ సంపన్నులు యే అద్వయానందము పొందగలరో, అదే ఆ అద్వయానందమే మీరును, నిశ్చయముగా బొందగలరు. సత్యము, సత్యము. సత్యము. ఎప్పుడైతే నిరంతరము సమస్త స్త్రీ పురుషుల యందు నా భావన జేయబడునో, అప్పుడు కొద్దిరోజులలోనే సాధకుని హృదయమున నున్న చిత్తమునందున్న, స్పర్థా, ఈర్ష్యా, తిరస్కారము, అహంకారము మొదలగు దోషములు దూరమైపోవును. అప్పుడు తనవారే యెగతాళి చేయుదురు. చేయనిండు. దానిని లెక్కజేయరాదు. నేను మంచి దాన్ని అది చెడ్డది. అను దేహదృష్టిని లోకలజ్జను వదలిపెట్టి కుక్క, చండాలుడు, గో. మరియు గాడిదకు! భూమిమీద పడి సాష్టాంగదండవత్ ప్రణామము జేయవలెను. యెంత వరకు సమస్త ప్రాణులయందు నాయొక్క భావన (భగవద్భావన) గలగదో అంతవరకు ఈవిధంగా మనస్సు, వాక్కు శరీరము, యొక్క అన్ని సంకల్పములు అన్ని కర్మల ద్వారా

నాయొక్క యుపాసన జేయవలెను. ఉద్ధవా! యెప్పుడైతే సర్వత్ర సమబుద్ధి బ్రహ్మ బుద్ధిని అభ్యాసము జేయునో అప్పుడు కొద్ది దినములలోనే వానికి జ్ఞానము గలిగి అంతయు బ్రహ్మ రూపముగా గనుబడ మొదలిడును. అట్టి దృష్టిగలిగిన తరువాత సకల సంశయములు సందేహములు వాటంతట అవే నివృత్తిగాగలవు. అప్పుడు సర్వత్ర నాయొక్క సాక్షాత్కారమును బొంది సాంసారిక దృష్టి నుండి ఉపరతుడవును. నన్ను పొందుటకు ఎన్ని సాధనలున్నవో వానిలో సర్వశ్రేష్ఠ సాధన యిదియే. గాన సకల ప్రాణులయందు పదార్థములందు మనస్సు వాక్కు శరీరముయొక్క సమస్తవృత్తుల ద్వారా నా భావనయే జేయవలెను. కృష్ణోద్ధవ సంవాదము-శ్రీభాగవతం. 29 – అధ్యాయము - 15, 16, 17, 18, 19 వరకు.

పైచెప్పిన విషయమున సాష్టాంగదండ ప్రణామము జేయవలెను అని పురుషులకు జెప్పినారు.- స్త్రీలు నమస్కారంజేస్తే చాలును. ముందు యిలా అభ్యసించవలెను. ముందు యింటిలో వున్న తండ్రికి, అక్కగారికి, యింటికి వచ్చుకుక్కలకు, బల్లులకు, పిచ్చుకలకు, తులసికి, పుష్పజాతికి, యే చెట్టు అయినా యే జీవిఅయినా, సూకరము, ఖరము, యిట్టి అభ్యాసము చేత ఇంటికి వచ్చు బిచ్చగాండ్రు - పాలు, పెరుగు వాండ్లందరికివారికి తెలియకుండానే ఆత్మభావం లేక అహం భావంతో నమస్కరించుట అభ్యసించితే ;అన్నీ చదువుకొని అహంకారము వదలుకోలేని వారికి దుర్లభమగు అద్వయానందము మీ సొత్తుగాగలదు. భావబలానికే సుమా సాధన. భావబలం పొందకపోతే చాలాకాలం సాధనలోనే వుండాల్సి

వస్తుంది. మానవునకు అసాధ్యమేది లేదు. శనైః, శనైః. అనగా కొంచెం కొంచెంగా ప్రారంభించితే అదే దృఢాభ్యాసముగా మారుతుంది. ఇట్టి సాధనకు అవసరమున్నంతనే వ్యవహారం వుండాలి. అనవసర వ్యవహారం వదలుకోవాలి, అలాగే ఉత్తమ సాంగత్యము వుండాలి అస్తు.

అహంకార నివృత్తికి అమోఘవుపాయం కృష్ణస్వామి జెప్పినారు. నాకు ఇది అత్యంతప్రియం గాన మీకునూ వ్రాయుచున్నాను. మీ నాన్నగారికి నారాయణ స్మరణలు. భక్తులందరికి నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

---

శ్రీమతి నాంచారమ్మకు - పొన్నూరు.

నారాయణస్మరణలు.

భగవాన్ కృపాకటాక్షమున నిత్యనియమంగా, భగవత్సేవ చేసుకుంటున్నావని తలంచుచున్నాను. ప్రపత్తి మార్గంలో సౌలభ్యం యెక్కువగుట తదనుష్ఠాతలకు మరింత ఆనందముసుమా! భారమంతా శ్రీ నారాయణునకే తదాశ్రయులకు యెంతో ఆనందము. నారాయణుడుగూడ తన భక్తులను అరచేతులమీద నడుపుకుంటాడు. రవంత బాధగలుగనీయడు. అర్థాత్ మాత బిడ్డనుగాపాడినట్లుగా కాపాడుచుండును.

"నమేభక్తః ప్రణశ్యతి" అని శ్రీమాన్ ప్రతిజ్ఞ నిరంతరము భగవంతుని మరువక, తింటూ, తిరుగుతూ కంటూ పరుండుచూ భగవంతుని మరువకుండు పే భక్తుని

స్వరూపము. తనను తాను అర్పించుటకు భక్తునికెంతో సహాయము భగవంతుడు కల్పించినాడు. అది సులభము గాని, జ్ఞానమార్గమువలె కష్టముగాదు.

మానవునికి ఆస్తి మాధవుడుగాని మాయగాదు మాధవుని స్మరింపక, ఆశ్రయింపక మానవుడు మాయను తొలగింపజాలడు. అంతంగలది మాయ. అనంతుడు భగవంతుడు. అందుచేతనే మాధవాశ్రయమే మానవ జన్మ ముఖ్యోద్దేశ్యముగాని మాయపాలై మానవత్వమును నాశన మొనరించుటకుగాదు. కలికాలమగుటచే పరమాచార్యులగు గురువులు కరుణాళువులు గాన ప్రపత్తి మార్గమును ప్రసాదించినారు. ఈ వ్రాతయెందుకని తలంచవలదు ఈ విధమగు పూజచేత కరములు సార్థకములని తలంపుచే వ్రాయడము సుమా! భగవంతుడు నీకు తీరికనిచ్చినాడు. పెద్దవుత్తరమైన విసుగు జనించదు. ఇతరులకు అనేక యిబ్బందులుండుటచే "శ్రీహరి" అని తలంచుటకు కూడ సమయంవుండదు. అని సమయాన్ని వ్యర్థంగా గడుపుతూంటారు.

మహదానందమైన మాట. పొన్నూరులో 11-11-64 నుండి శ్రీ రంగయ్యగారి తలంపున 7 దినములు భాగవత సప్తాహం. భాగవతము వినుమహాభాగ్యము గలుగుచున్నది. ఇంతకన్న ప్రియమైనదిలేదు. ఉద్యోగ ధర్మమున నుండుటచే మురళిని మురళీధ్వని వాని కథ, లీలామృతము పానమొనరించుటకు రమ్మని వ్రాయజాలనైతిని. కలంనోచుకోలేదు.

— అవధూత.

హరేరామ్. నారాయణస్మరణలు కన్యాకుమారి, 9-6-66

నిన్న యిక్కడకు వచ్చినాము. శరీరమారోగ్యం గానే యుంటున్నది. నీ అనుష్టానం నిర్విఘ్నంగా జరుగుతున్నదని తలచెదను. పారమార్థంలో భగవదాశ్రితులకు వచ్చేవి పరీక్షలేగాని అన్యంగాదు. ఇంకొక విశేషమేమున ! సర్వార్పణము జేసికొన్నవాడు భగవదిష్టమని సంతోషించుతాడు. అట్టి వానికి కష్టాలు లేవు-పరీక్ష లేదు. నిత్యసంతోషిగా ఉంటాడు. క్రమక్రమంగా భగవదాశ్రయంలో జారకుండా యుంటే అన్ని యోగ్యతలు గలుగుతాయి. భక్తులందరకు నారాయణస్మరణలు.

ఋణమోచన కర్తారః, పితుస్సన్తి సుతాదయః ।
బనమోచన కర్తాతు, స్వస్మా దన్యో న కశ్చన॥
— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

ఒక భక్తునికి వ్రాసిన లేఖ ఇంద్రప్రస్థము
హరేరామ 25-7-62

జై హరి, శ్రీహరి, అమ్మ జగజ్జననీ, కృపామయి, తల్లీ, చిత్స్వరూపిణి, శివా, భవానీ, నారాయణీ, అమ్మా, అమ్మా, నీవు గాని వస్తువే లేనపుడు ఏనామము నీనామము గాదు. కానీ అమ్మా! జగదంబా! నీఅనుగ్రహముంటేగదా భ్రాంతిచే అన్యముగాదోచు సర్వస్వమును నీవుగా దోచుట గలుగును. భువనేశ్వరీ ! నీదయ అపారము. అనంతము. అమ్మా! కరుణావరుణాలయిా! భక్తవత్సలా! సహజానంద స్వరూపా! ప్రసాదింపుమా, నీ అనుగ్రహమును. కుపుత్రుల

యందు కూడా నీకు వాత్సల్యము అపారముగదా వింటిని. వింటిని, నీ కపకారమొనర్చిన కాకాసురునియందు నీకెంత ప్రేమ. నిన్ను అనేకవిధముల బాధలుపెట్టిన రాక్షసస్త్రీల మీద యింకా అన్యాపరాధులయందు ఎంతకరుణ. అమ్మా-అమ్మా-అమ్మా నీవుగా అన్యములేదు. ఉండుట భ్రాంతి తోచుట భ్రాంతి అమ్మా-అమ్మా, జగజ్జననీ! తల్లీ! అమ్మా! నీభక్తులైన వారు, దేనిని ఆశించెదరు ? ఆశించువారు నీభక్తులగుదురా! కారు, కారు, కారు. నీభక్తులయందు నిర్భయత్వము, నిర్మమము తప్పక గలిగియుండును.

— హరేరామ హరేగోవిందా హరేగోపాల.

---

మూర్తిగారికి సకుటుంబముగా
నారాయణస్మరణలు ! | విజయవాడ
1-10-71

నా ఆరోగ్యం బాగానే యుంటున్నది. భీమవరంలో దసరా పూజలు సంకీర్తన విజయవంతముగా జరిగినవి. 70 సంవత్సరముల వయసువున్న బ్రహ్మచారి ఒకరు 3 వ, పర్యాయము భారతదేశ, తీర్థములు, క్షేత్రములు కాలినడకతో జేయుచు వచ్చిరి. వైశ్వదేవపరులు-కేవలం వైదికుల ఇంటి లోనే-స్వహస్తం జేసుకొనెదరు. అలా లభించనిచో-ఎన్నిదినములైనా పండ్లమీదనే-లేక-ఉపవాసములతో గడిపెదరట. నిరంతరం-జపంలో యుంటారు. విద్వాంసులు, సరళస్వభావులు-వారు, 5 దినములు సంకీర్తనకువచ్చిరి. భాగవతము, భగవన్నామము కలి ప్రధానసాధన మని యెన్నో ప్రమాణ

ములద్వారా చక్కగా చెప్పిరి. అందరకు నారాయణస్మర ణలు. బోల్ భక్తవత్సల భగవాన్‌కి జై.

— అవధూత.

---

జె. జె. రామారావు,　　సిద్ధాంతం.

వాసుదేవ స్వరూపా! ఇప్పుడే భీమవరం తీసుకువెళ్ళు చున్నారు. జగన్నాథా-కొంచెముగా ఆరోగ్యం కుదుటపడి నది. మహాదేవా! అధికముగా మాట్లాడజాలను. నారా యణా! వచ్చినట్లయితే చూడగలరు. కృష్ణా! ఎప్పుడు వచ్చినా సంకీర్తన ప్రారంభ సమయంలో నేను బయటకు వచ్చెదను. హరి-గ్రహించగలరు. ఏకాంతం అవసరం. జనా ర్దనా! యీ 4 మాసములనుంచి మాధవరామ్ నాకు సేవ యెంతో చేసినాడు. నావద్దనే యున్నాడు. రాఘవ! అంద రికి నారాయణ స్మరణలు.

— హరేరామ్.

---

పి. జె. కె. మూర్తి　　తరగటూరు

జయతు జగన్మంగళం హరేర్నామ.　　26-12-69

అందరికి సకుటుంబముగా నారాయణస్మరణలు. ఈ మధ్య నేను చిత్తూరుజిల్లా పర్యటనచేసి వచ్చినాను. మీరు తెనాలికి వ్రాసినవి వరు ఇక్కడకు పంపినారు.

భగవాన్! కృపాకటాక్షముచే 15వ తేది ఆపరేషన్ అయినదని తలంచెదను. అమ్మా! ఇంట్లో అందరు వారి వారికున్న సమయములో హనుమాన్‌చాలీసా "నాసై రోగ

హార్రై సబపీరా" అనేది, సంపుటిచేసి పారాయణచేయు చుండవలెను. భగవాన్ కృపచే ఆరోగ్యలాభము గలుగును. అందరకి నారాయణస్మరణలు.

— అవధూత.

---

మాధవరాంకు.

రామనామాన్ని నమ్ముకో, బహిర్ముఖుడవు గాకు. అంతర్ముఖుడవుగా ఉండాలి. రామనామం మనసా, వాచా, చేసుకోవాలి. సుఖమును పొందగలవు. మంచి చేసినవానికి అధోగతిలేదు. నీవుచేయు ఆధ్యాత్మిక కృషే నీకు తిండిపెడు తుంది. అన్నం అన్నం అంటే ఎవ్వరూ పెట్టరు దుఃఖాల పాలవుతావు. రామా అంటే సుఖపడతావు. నీకు నీ ఆత్మే దిక్కు. రాముడే గతి యని దృఢనమ్మకం కావాలి. నా మాటవలన శ్రేయ మని నీకు మనసా వాచా అంతరించింది. ఇప్పటికయినా శ్రీరామునియందు, రామనామము నందు విశ్వాసము త్రికరణంగా వుంచు. అభయం పొందుతావు. బయట ఎన్ని చెప్పినా నీగతి అధోగతే. కలియుగంలో జ్ఞాన సాధనం ప్రతిష్ట కోసమే. సీతారాముల ఆశ్రయమే సర్వశుభములకు ప్రారంభం.

— హరేరామ్.

---

శ్రీ మంగళగౌరికి. నారాయణ స్మరణలు. భీమవరం, 5-10-72

ఒక మాసం విశ్రాంతి అవసరం. ఇక్కడే వుండ గలను-ఉద్యోగం నిమిత్తం నీవు కంగారుపడకు. "దుర్గమ

కాజ జగతకే జేతే-సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే” అను నది సంపుటిచేసి మూడుపూటల హనుమాన్ చాలీసా చదువుము.

అర్థాత్ భగవదాశ్రయంలో జీవునకు అపజయమే లేదని భావము. తద్విముఖత్వమే-విపత్తు. తత్సుముఖత్వమె సంపత్తు. మీ యింటిముందు దేవాలయంలో ఉన్న శ్రీ కోదండ రామచంద్ర ప్రభునకు అనంతానంత ప్రణామములు. మీరు నిత్యము దర్శించి, ప్రదక్షిణ పూర్వక నమస్కారము జేసికొనుడు. ప్రదక్షిణము చేతులు ఊపుకుంటూ జేయకుడు. నమస్కారపూర్వకముగా మెల్లగా నడచుచూ జేసుకొన వలెను. శ్రీరామరక్ష - సర్వజగద్రక్ష.

— అవధూత.

---

శ్రీ సీతారామమ్మ
తెనాలి

బృందావనము
25-11-67

జయతు జగన్మంగళం హరేర్నామ. ధర్మపుత్రి! చి. సీతారామమ్మకు నారాయణస్మరణలు. వాసుదేవ! సద్రూపుడైన, గోవిందుని, గోపాలప్రభువు పాదపద్మభక్తి వాంఛించుచు వ్రాసినవుత్తరము జూచినాను. సంతోషము. జీవునికి యేక్షణంలో, యేముహూర్తంలో భగవన్నామ స్మరణ లేకుండా జరుగుతుందో అది పెద్దహానిట, గొప్ప లోపమట, అప్పుడు అంధత్వమట, అంతనిషేధమే లేదట. యని జెప్పినారు. ఇది గృహస్థులకు సాధ్యమేనా? అనిపిస్తుంది, గాని అభ్యసించినవారికి సాధ్యముగాక అసాధ్యమేమిలేదు.

అలాగున్నవారిని జూడటము గలిగినది. దానినే అనన్యత అంటారు. అదే శ్రీభక్తరాజు ప్రహ్లాదునియొక్క నిష్ఠ.

ప్రతిదినము, 5 నిమిషములు యీవిధంగా సాధన జేయాలి. ఆ అయిదు నిమిషములలో, కంటికి కనబడినవి, మనస్సుకు తోచినవి, వస్తువులుగాని ప్రాణులుగాని, శ్రీహరి స్వరూపమేనని చేతులుజోడించి, మ్రొక్కవలెను. అలా 6 మాసములు అయిన తరువాత 10 నిముషములు చేయాలి. 1 సంవత్సరమయిన తరువాత 20 నిముషములు జేయవలెను; సంవత్సరన్నర అయిన తరువాత, 40 నిముషములు. రెండవ సంవత్సరము వచ్చేసరికి 1 గంట. యిలా టైము పెంచుకొంటూ, చేసినటులయితే, నిశ్చయంగా, సర్వభూతమయంగా భగవంతుణ్ణి జూడటం గలుగుతుంది. ఇట్టి భావమును బొందుకొరకే సాధన, యెన్నిజన్మలెత్తినా యీభావమును పొందవలసినదే.

ఆసమయంలో యెదురుగా కూతురువచ్చినాసరే యిష్టదేవునిరూపంగా తలంచి నమస్కారం జేయాలి, లేక బిచ్చగాడువచ్చినా కుష్టువాడు కనుపించినా కుక్కలు పందులు పురుగులు, పుట్టలు, యేవిజూచిన, సర్వమూ హరియొక్క రూపమేనని వందనము చేతులు జోడించి, శిరస్సువంచి, చేయవలెను. తప్పక యిట్టి అభ్యాసము జేయవలెను. బద్ధశత్రువులుగూడా, విషంగూడా హరిస్వరూపముని నీకు స్పష్టంగా తెలుస్తుంది. అనుభవంగా పైభావమును అభ్యసించక మొండితనంగా యెన్నిమాలలు జపంచేసినా, యెన్ని నియమాలు

పాటించినా, యెన్నియాత్రలుచేసిన, జన్మలెత్తటం పెరుగుతుంది. అర్థాత్ చాలాకాలం పై భావం వచ్చేవరకు యుండాలియని, అందుచేత, తప్పక తప్పక తప్పక పై విధంగా అభ్యసించుటకు ధృఢ సంకల్పము చేయును. ఆసమయంలో మాటలాడుట యుండదు. ఈజన్మలోనే అందుకోవాలి. మరుజన్మమాట ఇప్పుడు అనవసరం. వృత్తరం అందిన నాటినుండి ప్రారంభం, 5 నిమిషాలతో అభ్యసించుము. రోజూ ఒకే సమయం ఉండాలి, మార్పురాగూడదు.

— అవధూతేంద్ర సరస్వతి.

---

శ్రీ పి. జె. కె మూర్తి గారు　　　　భీమవరం

సకుటుంబముగా నారాయణ స్మరణలు ।　　　　22-9-71

భగవాన్ కృపాకటాక్షముచే శరీరారోగ్యం బాగానే యుంటున్నది. ప్రతి జీవికి స్వాధ్యాయ మవసరము. తన సంగతి తనకే తెలియకపోతే మానవత్వముయొక్క విశిష్టతను వ్యర్థము జేసినవాడే యగును. స్వాధ్యాయము వలన దైవ సంపత్తు పెరుగుతుంది. భౌతికమువలన అసురసంపద నోటికి వచ్చినది కనుక, అదియే మారకుండా యుంటే జీవితంలో ఆపదలొచ్చినపుడు ఆదుకుంటుంది. ఆపదయనగా అచ్యుత విస్మరణేగా ! అస్తు. భక్తులందరికి నారాయణస్మరణలు.

— అవధూతేంద్ర.

---

అమ్మా ! వాసుదేవ ! గుంటూరు

సనాతనీ ! సత్యస్వరూపా ! జయము. జయము. 4-7-73

'సర్వోఽపి కార్యం బ్రహ్మణా కృతం'. ఎంతనిజము. అందుకనే సనకాదులతో హంసరూపుడైన భగవానుడు 'మనసా వచసా దృష్ట్యా గృహ్యతేఽన్యైరపీంద్రియైః అహమేవ నమత్తో అన్యదతి బుధ్యధ్వ మంజసా' అన్నారు.

అమ్మా అనుభవంగాక పోయినా అసలు బ్రహ్మవిలాసమేగదా ! విలాసమనగా-అనన్యమేగదా ! ఒకరు కల్పితమంటారు, మరొకరు మాయ అంటారు. ఆ రెంటికి అధిష్ఠానం ఆత్మేగదా !

చూడు - శరీరము వ్యాధి, బాధలు, ఏడుపులు, జన్మలు, మరణాలు వాసుదేవుడే. గీతలో అష్టమూర్తులన్నారు. అంతా దానిలోనే యిమిడిఉన్నది. ఆహా ! అందరికి తోచేది అనేక నామరూపాలతో నేనే దర్పణ దృశ్యంలాగ నాయందే అంతా నేనే "స యేవ సర్వం యదస్తి యన్నాపి..." సద్బ్రహ్మ కార్యం సకలం తదేవ.

"అత్ర ఆత్మవ్యతిరేకేణ ద్వితీయం యో న పశ్యతి స మహాత్మా స యోగీ బ్రహ్మభూయాయకల్పతే" వాసుదేవ !

1 వ తేదిని స్టేషనులో రైలు ఎక్కబోతే ముందుగానే అసాధ్యంగా నొప్పి వచ్చినది. వెంట శాస్త్రి ఉన్నాడు. వూరిలోకి పోలేక అక్కడనే ఉన్న విజయవాడ రైలులో విజయవాడ పోయినాను. రైలు యెక్కినతరువాత నెమ్మదించినది. ఈ లీలలు యెంతకాలమో ? వాసుదేవ !

— అవధూతేంద్ర సరస్వతీ స్వామి.

చిరంజీవి సరస్వతి నారాయణస్మరణలు.

కలిమలాపహారి, భక్తిరస పరిషించిత శ్రీ మద్భాగవత సేవనము, సత్యము కృష్ణా భిన్న స్వరూపమను భావముతో చేతులు మోపక వరుండిగాక అతి శ్రద్ధా, భక్తితో చదువు కొను చుంటివిగదా? భగవత్ప్రేమతోనే కీర్తనలతోనే అన్ని సాధనలకు సంపన్నత భగవన్నామ జపమునందు ప్రీతిలేనిచో వ్రతములు, యాత్రలు, ఉపవాసములు, వ్యర్థము.

వాసుదేవ! హరినామ విషయమై సంకల్పము జేసి నచో జీవులకు మహాలాభము గలుగును. సర్వసుఖములలోని ఆనందమును ఆరు శాస్త్రములలో మథింపగా తేలిన సార మును భగవన్నామమై యున్నది. సోమరితనమును త్యజించి నామస్మరణ జేసిన మహాలాభము గలుగును. నామ జపము జేయు విషయమై మనసులో దృఢముగ సంకల్పముంచ వలెను. సంకల్పములేనిది యేక్రియలును జరుగవు-వాసుదేవ!

— అవధూతేంద్ర సరస్వతి.



లంక సత్యనారాయణగారు — గుంటూరు
భీమవరం — 30-12-74

వాసుదేవ స్వరూపా! ఏకాహమున రామనామా మృతమును గ్రోలిన భక్తుల పాదరేణువులకు జయ జయ కారములు.

పూజ్యులు మీ గురుదేవుల సమక్షమున సీతారాముల సేవ తదభిన్నమైన రామనామము సంకీర్తనము అత్యంత వైభవంగా సంపన్నమైందని తలంచెదను. రామనామ సంకీ

ర్తన పరులు ధన్యులు? వారి తల్లితండ్రి-వారి పుత్రులు - అతనిని కన్నతల్లి - అతడు సేవించిన తీర్థములు ధన్యములైనవి. ఎవడు గోవిందునితో విముఖుడో వాడు ఆదరణీయుడే గాని పూజ్యుడుకాడు. వాసుదేవ! ఇట్టి భావములు పోషించుకుంటే రాగద్వేషములు అంటకుండా రోమరోమంలో రాముడున్నాడనే స్పృహ దృఢమై అంతా రామమయం అంటూ అరిషడ్వర్గాన్ని అంతాన్ని అనంతాన్ని అంతులేని ఆనందంగా కీర్తిస్తూ ఆనందంలో మునిగి ఓలలాడుతూ పునీతుడై పునీతులను చేస్తూవుంటాడు.

— అవధూతేంద్ర.

---

చిరంజీవి సరస్వతికి నారాయణస్మరణలు. భీమవరం

విశ్వమే రూపముగ గలవాడు వాసుదేవుడు! హరే రామ - జపము జేయునపుడు మనస్సు యెచ్చటెచ్చట పరిభ్రమించునో అదియంతయు వాసుదేవ స్వరూపమే. చర్మ చక్షువులకు ఎట్లు గోచరించిన వాస్తవముగ అది వాసుదేవ స్వరూపమే. ఆ మాట మనస్సునకు పట్టించవలెను. సరే వాసుదేవాతిరిక్తముగ నీవు తిరుగుటకు స్థలమే లేదు - వస్తువే లేదు-ప్రాణియే లేదు. అచటనే వుండుము, అది దాసిష్టమున్నచోట వాలనిమ్ము. నీ భగవద్భావముతో ప్రయత్నపూర్వకముగ అనగా ఎక్కడ వాలినా వాసుదేవునియందే నని అఖండ విశ్వాసముతో నుండినచో మనస్సు మాయలో బడవేయ జాలదు......చర్మ చక్షువులు నిజమును చూడ

జాలవు. గాన వివేకనేత్రము స్వవశంలోనే యున్నది గదా ? అస్తు. వాసుదేవ.

— అవధూతేంద్ర సరస్వతి.

---

హరేరామ్. నారాయణస్మరణలు　　కుసుమసరోవరం, గోవర్ధనం
17-4-65

భగవాన్ శ్రీకృష్ణ చంద్ర ప్రభు అనుగ్రహమున, పులినవాసమున అఖండసంకీర్తనసై భవముగానసమాప్తి అయినది. తదనంతరము శ్రీగోవర్ధననాథుని యనుగ్రహమున ప్రదక్షిణము జరిగినది. నిన్న అన్నకూటము అనగ 56 రకముల పదార్థములతో శ్రీగిరిరాజను నివేదన, వేలు మంది భోజనం జేసినారు. అందరు బృందావనం వెళ్ళి పునః దర్శనములు చేసి 25 వ తేదిన బయలుదేరుదురు. నాప్రయాణం యింకా తేదీ వ్రాయలేదు భక్తులందరు క్షేమము. ఇంతే నారాయణ స్మరణలు.

— అవధూతేంద్ర సరస్వతి.

---

చిరంజీవి సరస్వతికి, నారాయణస్మరణలు.　　24-2-

సప్తాహం జరుగుచున్నది. ఈవిధంగా భగవన్నామం వింటూ అంటూ ఎన్ని జన్మలు మానవుడు యెత్తితే యేమి ? జన్మసాఫల్యం యిదేకదా ; ఆహార నిద్రాభయాదులన్నియు కేవలం పశువుల ధర్మమైతే, అవి ధర్మబద్ధంగా వుంచుకుంటూ మానవత్వాన్ని మాధవత్వంగా జేసుకొనుటయే జన్మవిశేషము...భగవన్నామం వదలకు, భగవంతుడూ వదలడు. శ్రీ

మారుతి-నామనిష్ఠ-సేవానిష్ఠ-భక్తులకు మరువదగనిది గాదు. భక్తకోటికి ఆచార్యుడు శ్రీఆంజనేయుడు. సర్వమూ వాసు దేవస్వరూప మని భావవృద్ధి పొందుము. వ్యవహారికంగా వున్నట్టు భావిస్తూ వాసుదేవతత్వాన్ని మరువవలదు. అదే సత్యం. వస్తువులూ, ప్రాణులు అసత్యం.

— అవధూతేంద్ర సరస్వతి.

---

శ్రీమీనాక్షీ గురుస్వామిగారికి ఆంధ్రాశ్రమం, ఋషీకేశం 7-6-65

హరేరామ్. నారాయణ స్మరణలు. అధమాధములు గూడా కేవలము శ్రద్ధతో నిరంతరము భగవన్నామ సంకీర్తనము జేయుచు తరించుచుండ, యిక శ్రద్ధతో భగవన్నామ మును చేయువారల భాగ్యమును ఎవరు గొనియాడగలరు? అందుకనే "నమే భక్తః ప్రణస్యతి" యని భగవానుడు పలికెను. ఏమన భక్తుడు తనను అనేకబాధలు పెట్టినను అఖండ విశ్వాసము భగవంతుని సత్తాయందు గలవాడగుటచే ఎవరిని ద్వేషింపక ప్రహ్లాదునివలె పరమేశ్వరాయత్త చిత్తమును గలిగి యుండును. భగవంతుని సత్తాయందు దృఢ విశ్వాసముగల భక్తుడు అన్యచింతలేక అవమానపరచిన ఆదరించుచు, సన్మానించిన త్రోసిపుచ్చుచు "అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన" మత్తుడై యుండుచు. ఆసక్తిలేక కేవలం శరీర నిర్వహణార్థము భుజించుచు శారీర కైంకర్యముగూడ భగవత్కైంకర్యముగ ఎంచి భగవన్మయముగ నుండును. అట్టి భక్తుడే భగవంతుడు. "పానీయంబులు ద్రావుచున్" ప్రహ్లాదుని

వలె అన్నివేళల భగవన్నామము చేయుచుండ ఏభక్తి దుర్లభము? ఏదియుకాదు. హరేరామ్.

— అవధూతేంద్రస్వామి.

---

జయతు జగన్మంగళం హరేర్నామ  సంకీర్తన భవనం వంశీవటం
బృందావనం

శ్రీ సత్యవతీదేవికి నారాయణ స్మరణలు. శ్రీకృష్ణచంద్రుని ధామమైన శ్రీ బృందావనములో శ్రీకృష్ణచంద్రుని ఝూలా వుత్సవములు వైభవంగా జరిగాయి. సత్పురుషులు, సత్సంగములు, రాసలీలలు, తనను తానుగా తెలిసికొనుటకు భక్తహితార్థము జేయు వైభవములు గదా! తనను జూచు వారికి తాననుగ్రహించక అన్యు లనుగ్రహించు టేమి? తనను తా ననుగ్రహించుకొనుటయే. అంతర్బాహ్య వ్యాపినియైన అమ్మ నాంతర్బాహ్య వ్యాపినిగదా! అమ్మా-ఆ నేను-యీ నేనుగదా! మాటలు గాదమ్మా! తెలియనట్లున్నా అంతే నమ్మా. నిజమమ్మా:- మట్టియొక్క శక్తికుండ, అలాగే నమ్మా-పరమేశ్వరునిశక్తి ప్రకృతి, యింతమాత్రమే నమ్మా; నిజానికి అడ్డు ఏమున్నదమ్మా; లేదు అనేది ఉన్నదానికి భిన్నముగాదమ్మా; నీవాళ్లో ఉన్నది నీవేకాదంటె నీలీలే గదమ్మా; నీమొళ్లోవున్నది కనుపించటము లేదంటె నీలీలే గదమ్మా; జయమా! జయగురుమా! మా భై ర్మా భై ఘోషిణి.

నామస్మరణా దన్యోపాయం, నహి పశ్యామో భవతరణే,
రామహరే కృష్ణహరే తవనామ వదామి సదా నృహరే॥

— అవధూతేంద్ర సరస్వతి.

ప్రమాది - దీపావళి భీమవరం
మీనాక్షీమందిరం, 19-10-73

అమ్మా! కామక్రోధ మదలోభ ఈర్ష్యా ద్వేషములను హృదయంలోంచి హరించి, భవ్యములైన భావాల్ని నింపెయ్యవమ్మా!

చంచలమైన చిత్తము నలువైపులా పరువెత్తుచుండును. (అమ్మా) నీచరణ కమలములందుంచు కొమ్మా! ముఖము మధురవచనమయంగా, సుందరంగా యుండేవరాన్నివ్వమ్మా!

అమ్మా:- నీ దయాదృష్టితో నిత్యమూ బ్రతికే ఒక్క వరమిమ్మా! నీకు నతమస్తకుడను. వరదహస్తమును శిరమునందుంచుము! అమ్మా!

— అవధూతేంద్ర స్వామి.

అమ్మా! భీమవరం 23-10-73

ఘటపట శకటాదికం చ సర్వం
విభు రితి చేద్గలిపైన సాత్వవిద్యా।
ఘటపటశకటాది కం చ సర్వం
నవిభురి తీర్యదితే హ సాత్వవిద్యా॥

అమ్మా! 'బ్రహ్మణి బ్రహ్మజృంభతే' భగవత్పాదులన్నారు 'మహాంతే ఆత్మానం దృశ్యతయాపి ద్రష్టృతయాపి జానన్'.

అమ్మా! 'మమాతా న భవతి, అద్వయ బ్రహ్మ సనాతని' మా! ఆత్మవిలాసముతో అభిన్నప్రబోధముతో జాబులు వ్రాయుము.

— అవధూతేంద్ర సరస్వతి.

హరేరామ్ నారాయణస్మరణలు. మదరాసు 24-5-66

వెంకటగిరిలో శ్రీ రామకృష్ణానందస్వామి కలసినారు. యస్లపల్లి ఉత్సవములలో కనుపించినావని చెప్పినారు. ముఖ్య విషయం భగవత్స్మరణయే గదా-

మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్త స మే ప్రియః।
హర్షామర్ష భయోద్వేగై, ర్ముక్తో యః స చ మే ప్రియః॥
సర్వారంభ పరిత్యాగీ, యో మద్భక్త స్స మే ప్రియః।
శుభాశుభ పరిత్యాగీ, భక్తిమాన్ య స్స మే ప్రియః॥అస్తు-

— అవధూతేంద్ర సరస్వతి.

---

శ్రీ మీనాక్షీగురుస్వామిగారికి శ్రీ శైలము
భీ మ వ ర ం 9-12-64

దుర్గేస్మృతా హరసి భీతి మశేషజంతోః
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ।
దారిద్ర్యదుఃఖ భయహారిణి కా త్వదన్యా
సర్వోపకార కరణాయ సదార్ద్రి చిత్తా॥

దుర్గములందు బడినపుడు నిన్ను స్మరించుటచే నీవు సర్వప్రాణుల భయమును హరింతువు. మరి స్వస్థావస్థయందు స్మరించుటచే నత్యంతశుభము నిత్తువు. దారిద్ర్యదుఃఖభయ హారిణి సర్వజీవులకు నిట్టి లుపకారముజేయు సదార్ద్రిచిత్తవు నీవుగాక మరెవరమ్మా!

— అవధూతేంద్ర సరస్వతి.

చి. నారాయణకు భీమవరం. కుర్తాళం 4-6-66

నారాయణ స్మరణలు. నిన్న మధుర మీనాక్షమ్మను దర్శించి, యింకా కొన్ని మందిరములు దర్శించి రాత్రి ఇక్కడకు జేరినాము. పూర్వపు రాజులు ఎంతఐశ్వర్యముతోనున్న శివకేశవ భేదము లేక దేశంలో ప్రజలు తరించుటకు రెండు విధాలా, అనగా భౌతికంగా పారమార్థికంగా సేవజేసుకున్నారు. జన్మసార్థకం జేసుకున్నారు. నిజంగా ఆలోచిస్తే ఎంతబలంవున్నా, ఎంతధనంవున్నా, ఎంతజనంవున్నా అనుభవించో, దానం ధర్మంచేసో, పోగొట్టుకునో మానవుడు వెళ్ళిపోతున్నాడు గాని దేహంతో అనుభవించి అవి మనసుపట్టి ఆవాసన వదలకపోతున్నవాడు మరల పుట్టుచున్నాడు. ఈజన్మకు అదే పెద్దప్రమాదం. ఏదైనా అనుభవించి తరువాత లేదని బాధపడకపోతే మంచిదే. బాధపడినాడా అప్పుడే అనర్థంపాలవుతాడు. వాసుదేవ !

— అవధూతేంద్ర సరస్వతీ.

---

చి. నాంచారమ్మ ! పొన్నూరు ప్రకృతి ఆశ్రమం

హరేరామ్! నారాయణస్మరణలు. భీమవరం

భగవదనుగ్రహమున భగవన్నామ సంకీర్తన సేవా భాగ్యము పునః పొందేసూచనలు గనబడుచున్నవి. కాలము విలంబమయినా సంకీర్తన సేవకైనా మరల ఉపాధి వినియోగపడిన అనేకమంది భక్తులతో నామామృతమును జుర్రుకొనవచ్చును గదా! ఒక భక్తుడు భగవంతుని యాచిస్తాడు. ఎన్ని కష్టములు వచ్చినాసరే భక్తుల సాంగత్యమునుండి దూరమొనరింపవలదు. అని.

భగవద్భక్తులు ధర్మమునే ఆశ్రయించి యుంటారు. వారల కదియే కవచము. అట్టి కవచమును ధరించి సన్మార్గమును కాపాడు కొంటారు. కుసంగమున బడరు. బడనియ్యరు. భక్తులు అట్టి మహిమగలవారు. ఒకప్పుడు భక్తి అవ్యభిచారముగ వుండవలెను. వ్యభిచారభక్తిగూడ నిది అని అనినావు. ఆమాట యెరిగియున్నను నాటినుంచి బరువుకు రావటములేదు. భగవాన్ కృష్ణప్రభువుగూడ నన్ను అవ్యభిచారభక్తిగలవారే పొందుదురని శలవిచ్చినారు. ఏకనిష్ఠను అవ్యభిచారభక్తి. నిజముగ భక్తుల సాంగత్యము వలననే గదా ఒక్కొక్క సమయమున గాఢాంధకారము పటాపంచలగును. భగవంతునియందు యపార యనురాగ ముదయమగును. బోలో భక్తునకు భగవానునకు జయము, జయము, జయము.

— జై జై సీతారామ్.

---

వాసుదేవ ! శ్రీరామ్‌కు, కారంచేడు. గుంటూరు 17-7-73

నేను నాయిష్టదైవమైన ఆత్మను బ్రహ్మయొక్క వివర్తమైన జగత్తును, ఈశ్వరుణ్ణి 'అహమేవ నమత్తో అన్యదితి' బుద్ధితో వాసుదేవానుగ్రహంవలన జయముతోనుంటున్నాను

తిథులు, వారములు, నక్షత్రములు, యోగము, కరణము బ్రహ్మయేకదా ! అటులనే నేను నాకభిన్నమయిన వ్యాధిని, దుఃఖమును, నిధన జననములు-ఔషధసేవనము-వైద్యులు సర్వము నేనైన బ్రహ్మగా యున్నాననే దృఢనిష్ఠ సమస్తసాధువుల అనుగ్రహముతో అందుకుంటున్నాను.

పుష్పమునలె దోసిలిలో నుంచితే కుడియెడముల భేదంలేక సమసుగంధాస్నచ్చేలాంటివారు-సాధువులు. అనుభవంలేక పోయినా నిశ్చయం అని పూజ్యస్వాములవారికి అందజేయగోరెదను.

'యస్యభావోఽఖిలం విష్ణుః తస్యనో బాధతే కవిః' — వాసుదేవ

---

అమ్మా ! వాసుదేవ ! నారాయణస్మరణలు హైదరాబాదు 20-8-73

నీ జాబు నాకు పరమానందమును గలిగించినది. "మమ మాయా దురత్యయా," యనుమాట పరమ సత్యము గనుక-దురహంకారముచే ఆనుంచు వాడను. ఈనుందే అని పరిచ్ఛిన్న బుద్ధుడనై మెలగితిని. ఈక్షణంగాదు షుమారు 10 దినములనుంచి వాసుదేవస్వరూపంగాని దేమున్నది? అవును, అయినా నాబుద్ధిలో సూక్ష్మఅజ్ఞానం-శ్రీరామనామం-భక్తుల ప్రబోధంతో-మంచిగా గ్రహించే అదృష్టం గలిగింది—

— అవధూత.

---

లంక సత్యనారాయణగారు. భీ మ వ ర ం

వాసుదేవస్వరూపా ! సకుటంబముగా నా రా య ణ స్మరణలు. నీవు ప్రేమతో భగవద్భావంతో వ్రాసిన లేఖ అందినది మనబోటి యంత్రాల కన్నిటికీ సంచాలకుడైన ఆవాసుదేవుని అనుగ్రహ బలముచే ప్రపంచములో అందరి పనులు నెరవేరుచున్నవి. అందుకనే మనకు వ్రాయుటకు శబ్దాలురావు. అథవా వస్తే వెనకనుండి వ్రాయిస్తున్నా డన్నది మరువరాదు.

వాసుదేవ ! ఒకసారి హరే యంటే చాలు. ఆయన వలలో పడినవారమై పోతాము ఆయన ఇష్టప్రకారముగానే అంతా జరుగుతూ యుంటుంది.

— అవధూతేంద్ర సరస్వతిస్వామి.

---

సర్వే నశ్యంతి బ్రహ్మాండే ప్రభవన్తి పునః పునః ।
నమేభక్తాః ప్రణశ్యన్తి నిశ్శంకాశ్చ నిరాపదః ॥

నారాయణస్మరణలు.

జీవుడా ! దేహచింత, అర్ధచింత, సర్వమును వదలుము. ఆ యేర్పాట్లు నే నొనరించితిని. నన్ను పిలువు, నన్ను పిలువు. నీ జ్వాలలు దగ్ధమగును. భయము నొందకు, భయము నొందకు.

స్థిరత్వము నొందువరకు నామజపము జేయుము. నీ పాదముల క్రింద భూమి తొలగినాసరే, ఆకాశము విరిగిపడినా సరే. సర్వనాశనమైననూ, ఎటుజూడక అహర్నిశలు నామ మును స్మరింపుము. కీర్తింపుము. నీవు నిశ్చయముగ నమ్ముము. నా యొడిలోనే ఉన్నావు. కౌగిలించుకొని నిన్ను రక్షించు చున్నాను. నామము-నామము జేయుము. భగవాన్ కృష్ణ చంద్ర సాక్షిగోపాలం, జగన్నాథము వెళ్లివచ్చినాము. సాయంత్రము కటక్ వెళ్లుచున్నాము.

— హరేరామ్.

శ్రీమీనాక్షిగురుస్వామి మొదలియార్ కురుక్షేత్రం.
భీమవరం 26-4-65

నారాయణస్మరణలు: శ్రీరాధారాణి శ్రీకృష్ణునితో ప్రణయకోప మభినయించిన మాన సరోవర ప్రాంతమున నిర్మించి గోలోకధామమునందు, మాసము రోజులు 130 మంది భక్తులతో అఖండనామము సోత్సాహముతో సంపన్నమైనది. అనేకమంది సాధుపుంగవులు విచ్చేసిరి. ఆంధ్రులకు ప్రియాపీతము కుంజము, నేపాలీభక్తులకు లలితాకుంజము, రంగవల్లీత్యాదికి అస్సాము వారిది చిత్రలేఖాకుంజము, బీహారువారు రాజస్థానంవారు, బృందావనంవారు-మిగిలిన విశాఖ తుంగభద్ర-బెంగుళూరు వారు సుప్రసిద్ధులు సీతారామదాస ఓంకారనాథవారిశిష్యులు, గురు-నామనిష్ఠులు మరియు-నేపాలీభక్తులు బహునేత్రోత్సాహముగా తమ లలితాకుంజమును అలంకరించుకొని అత్యంత శ్రద్ధతో వినయ నిరహంకార ఆదర్శముతో తమ అఖండనామమును సంపన్నము గావించుకొనినారు. 13-4-65 బయలుదేరి 14, 15 తారీకులలో ఒకవెయ్యి మంది సుమారు గోవర్ధన ప్రదక్షిణము గావించి !6 వ తేదిన 10వేల రూప్యముల ఖర్చుతో కుసుమసరోవరంవద్ద సంతర్పణ గావించి ఆరోజున వ్రత సమాప్తి జేసినారు. 17 బృందావనం జేరి 19న అఖండ నామంతో బృందావన ప్రదక్షిణము గావించి నారము. వ్రజమున ప్రధానస్థలములు దర్శించి నిన్న భక్తులందరు బయలుదేరి వెళ్లినారు. "నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే"

— అవధూతేంద్ర సరస్వతీ.

## 115 పేజి హిందీకి అనువాదము

హరికిషన్‌కు నాగపూర్

హరేరామ్ నారాయణస్మరణ్
ఈలోకమున అనాథు డెవడు
వెంట త్రిలోకనాథు డుండగ
దయాశీలుడు, దీనబంధువు
కరములు మిగుల నుదారములు.
(మానవుడా !) రామభజనచేస్తూ
కర్మనాచరిస్తూ సాగుము
అందరితో కలసిమెలసి యుండుడు
అందరినామముల స్మరించుడు
(విరోధించక) అటులె, అటులె యనుడు
మీ నివాసస్థానముల నిలచియుండుడు
మానవుడు సర్వకర్మల నాచరించును

## 117 వ పేజి హిందీకి తెలుగు అనువాదము

(కాని) భూమి నెన్నడు వదలడు
వ్యభిచారిణి గృహకార్యముల నొనర్చుచుండును
(కాని) ఆమె మనసు నిరంతరము తనకాంతునియెడ
రమమాణమై యుండును
సరిగ, అదేరీతిగ మనసుచితమగు కర్మ నాచరించు
సమయమున, మనసుతో భగవద్ధ్యాన
మొనరించినచో, మనసున దుర్గుణము
చోటుచేసికొనజాలదు.

— హరేరామ్.

శ్రీరామ శరణు. తెనాలి
శ్రీయుత ప్రకాశరావుకు నారాయణస్మరణలు. 28-5-68

నీ ఉత్తరం అందినది. సరే భగవత్కృపయే నిజముగా అట్టి స్థలములయందు భగవదండ బాగా యుంటుంది. నీల కంఠపురం - నీలకంఠునిపురం లేక నీలకంఠుడు వుండేపురం - పురం అంటే శరీరం. దీని అధిష్ఠాతగూడా నీలకంఠుడేసుమా. అనగా అంతటికి అధిష్ఠాత నీలకంఠుడే అనుమాట. మరవ కూడదు. ఆయన ఆధారం మీదనే యిదంతాగాన అచ్చట ఆ నీలంఠపురంలో నీలకంఠుడు సదాశివుడు పరమాత్మ ప్రత్య గాత్మ చేదోడు వాదోడుగా యున్నాడు. ధైర్యముతో యుండుము. సుఖదుఃఖములు యెన్నున్నా తప్పవు-అంద రికి నారాయణస్మరణలు. హనుమాన్ చాలీసా పంపుతాను. బాగా ప్రచారం, అనగా సేవ జేయుము.

— అవధూతేంద్ర సరస్వతి.

---

నరసరావుపేట
వాసుదేవ ! 21-6-73

జాబు వ్రాయటం ఆలస్యమయినది. కారణం శరీరంలో చాలా అస్వస్థతగా యుంటున్నది.

చింతపల్లి యీ సమ్మరులో వద్దామని తలంచితిని. కుదరలేదు. మీరంతా యథాశక్తి భగవన్నామం చేసుకుంటు న్నారని తలంచెదను. ప్రస్తుతం అక్కడ యీ సీజనులో తేనె దొరుకుతుందా? ఇంకాఏమేమి దొరుకుతాయి.

వాసుదేవ, ఇప్పుడు అక్కడ వర్షాలు ప్రారంభమయి నవా ? మనస్సులో సహజంగా ప్రపంచం తోస్తూవుంటుంది. గాని మనం ప్రయత్నం చేస్తే భగవంతుడ్ని వుంచుకోవచ్చు. ఇట్టి ప్రయత్నం దృఢంగా జరగాలి. భగవానునియందున్న మనస్సుతో భగవానుని అనుగ్రహముతో అన్ని విపత్తులను దాటశక్యమగును. అందరికి నారాయణస్మరణలు·

— అవధూతేంద్రస్వామి.

---

వాసుదేవ స్వరూపా ! రాజమండ్రి
సకుటుంబముగా నారాయణస్మరణలు. 11-2-74

మీరందరు యథాయోగ్యముగా భగవన్నామమును చేసుకొనుచూ ఆనందముగా కాలము గడుపుచున్నారుగదా !

రామనామ లేఖనము నిర్విఘ్నంగా నియమం తప్ప కుండా జరుగుచున్నది గదా ! వాసుదేవ ! ఎన్ని సంకట ములు వచ్చినా ఆఖరికి తన 5 గురు పుత్రులను అశ్వత్థామ చంపినా, అర్జునుడు అశ్వత్థామనుకట్టి ద్రౌపతివద్దకు తెచ్చినా, ప్రతీకారబుద్ధి లేకుండా తన 5 గురి కొడుకులను చంపిన గురు పుత్రునికి వందనమొనరించి,నావలె ఎవరి తల్లికి పుత్రదుఃఖం రాకూడదని విడిచిపెట్టుమని వదలించినది. భగవద్భక్తిలో యింతటి దయాస్వభావం వస్తుంది. దయవలన దమం-శమం-క్షమా - ఓర్పు, అన్నీ వస్తాయి.

నారాయణా ! యీ రామధనాన్ని వదలకుండావుంటే పాండవులకు వచ్చిన కష్టాల్ని వాండ్లు సంతోషముగా సంపద

ల్లాగ ఆనందంతో అనుభవించారో, మీరు గూడా అలాగే ఆనందంగా అనుభవిస్తారు. యేమన భగవంతుడు అపారఅనుగ్రహాన్ని అన్ని సమయాలలో అంతటాగూడా ప్రసరింప చేస్తూ యుంటాడు. కాని వాసుదేవ! అప్పుచేసే అలవాటు భక్తిని ధ్వంసంచేస్తుంది. అది సాధ్యమైనంతవరకు లేకుండా వుంటే భగవద్ధనం అధికాధిక మవుతుంది.

— అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

శ్రీరామ. అరుణాచలం.

వాసుదేవస్వరూపా ! 22-8-74

నీవుత్తరం చూచితిని. సరియే. నీవు అశ్రద్ధ చేయక, 15 దినములైనాసరే వేచియుండి సక్రమమైన తేనెదొరికితేనే పంపించవలెను. ఏమాత్రమను మానమున్న మంచిది తీసుకొనియే 4 దినములు ఆలస్యమైన నగరి అడ్రసుకే పంపించవలెను. 'ముఖ్యగమనిక, "ఎంతపొదుపుగా జీవితము జరుపుకొన్న అంతభగవంతుని కృపఅందుకొనుఅదృష్టము లభించును. ఎంత అప్పులుచేసిన అంతఅధోగతికిపోవలసివచ్చును." అయితే ఆత్మద్రోహమువలన అధోగతికిపోయినా విడవకుండాచేసిన భగవన్నామము వదలకుండా చేసిన వాడిని పట్టిలాగి ఏజన్మకైన సద్గతిని అందించి తీరుతుంది. అయితే యీజన్మలోనే కష్టమే తపస్సనుకొని పాపనివృత్తికి ప్రత్యక్షోప్రాయమైన పరమేశ్వరుని, పతితపావన నామము మహాచతురత.

ఇట్లు

మీ అవధూతేంద్ర సరస్వతీస్వామి.

---

# అపూర్వ సూక్తులు

రు. 1-00

"శ్రీ శ్రీ. అవధూతేంద్ర సరస్వతి స్వామివారు తమ లేఖలలో, సమావేశములలో ఉటంకించిన సూక్తులను నాలుగు నూర్లపైగా సేకరించారు సంకలనకర్త. వీటిలో భగవన్నామమహిమ, వేదాంత విషయాలు, సాధన సూత్రాలు మొదలైనవి ఉన్నాయి.

ప్రభుదత్తబ్రహ్మచారి మహారాజ్ భూమికను, అరుణాచలము శ్రీ రమణాశ్రయులు వాక్పుష్పాంజలిని అర్పిస్తూ శ్రీస్వామివారి స్మృతులను మనోజ్ఞంగా వ్రాశారు. రామనామమహిమకూ ఆధునిక కష్టకాలాలలో నామస్మరణ సౌలభ్యాన్ని వక్కాణిస్తూ శ్రీస్వామివారు వ్రాసిన 15 పేజీలు హృదయంగమంగా ఉన్నాయి. చక్కటి పుస్తకం".

— రామకృష్ణప్రభ

సాధన గ్రంథ మండలి, తెనాలి



"గోడమీద బొమ్మలను చూచి ఎవడైనా మోస పోతాడా ? అలాగే రెండురోజులు ముఖం కడుక్కోకపోతే దుర్గంధం బయటకు వస్తుంది. అంతేసుమా జగత్తంతా. దృశ్య మంతా దుర్గంధమే. రామనామం ఒక్కటే దుర్గంధం లేనిది. రామనామం లేనిచోట మంచినీళ్ళు త్రాగకూడదు. వాళ్ళు అస్పృశ్యులు.

రామనామం లేనివాడు నిర్ధనుడు. మాధనం రా నామం. మీధనమునకు దొంగలభయంవుంది. మారామన ధనందగ్గర ఏభయమూ లేదు. ఈ రామనామధనం మ సమయంలో ఆదుకుంటుంది. "రామనామం లేకపో నష్టమేమిటండీ" అంటారేమో విను. 'నీవు వెళ్ళేవ ఒకటి వస్తోంది. వెళ్ళేటప్పుడు ఏడుస్తూ పోతావు. జాగ్రత్త" 